శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయై నమః

# త్రిలోకీవిజయము

## (ప్రహసనము)

(కొందఱు ఖేచరులు ప్రవేశింతురు)

ఉపకారప్రియుఁడు:—సహోదరులారా! మనలోనున్న పరస్పరవైషమ్యములన్ గూర్చి నే నెన్నిసారులు మొఱవెట్టు చున్నను మీ రించుకయు నామోదించినట్లు కనుపట్టమిఁ జేసి నా యుపన్యాసము లరణ్యరోదనము లగుచున్నవి. మనము బృహస్పత్యాదిపూర్వాచారపరాయణులు సెప్పుగ్రుడ్డిసారములు నమ్మక బాగుపడ నెంచెదమేని ప్రకృతము భూలోకస్థితిని జూచి నేర్చుకొనవలెను. అయ్యది యిప్పుడిప్పుడు మహోన్నతస్థితికి వచ్చుచున్నది. అందులోఁ గొన్ని భాగము లిదివఱకే యౌన్నత్య మునకు వచ్చియున్నవి. భరతఖండముమాత్రము పూర్వాచార పరాయణుల ప్రతిబంధకమున నింకను పరిపూర్ణౌన్నత్యమును బొందఁజాలకున్నది. ఇది యింతట విడిచి ప్రకృతాంశమునకు వత్తము. ఈ సంఘములో దేవత లనఁబడు నొకతెగలో వృద్ధి కొత్తిగాఁ గన్పట్టుట లే దని నేను వేఱే నొక్కి చెప్పనక్కఱ లేదు. భగవంతుని యభిప్రాయము మన మెల్లపురుషను ముప్పది మూఁడుకోటులే యుండవలయు నని యుండదు కదా! అట్టిస్థితిలో

మన మీ విషయమునఁ నేల శ్రద్ధ పుచ్చుకొనఁగూడదో నే
నూహింపఁజాల కున్నాఁడను. ఇంద్రాదిదిక్పాలురన్‌గాని, బృహ
స్పత్యాదు లగు దేవర్షులన్‌గాని మన మీవిషయమున నాలో
చనచేయుటలోఁ జేర్చుకొనఁగూడదు. వారు స్వార్థపరులు.
యజ్ఞాదులలోఁ దినమరిగి పూర్వాచారములే మంచి వని
వాదింతురే కాని యందలి యాథార్థ్యమెఱింగియు నితరులకుఁ
దెలియఁజెప్పరు. పైపెచ్చు మన యుద్యమమునకు భంగము
గూడ నొనరింపఁ బ్రయత్నింతురు. ఇయ్యెడ నడుము గట్టుకొని
లోకోపకార మొనరించు మన కొక్కప్పు డెట్టియిక్కట్టులేని
దుష్పండితులవలన రావచ్చును. అట్టియెడల నించుకయుఁ
జలింపఁగూడదు సుఁడీ! క్రమముగా మనకు భగవంతుఁడు
సహాయుఁడు కాకమానఁడు. ఈ సంఘములో మీమీప్రయోజ
కత్వమున మన మతపక్షమున కెందఱం ద్రిప్పితిరో అయ్యది
ముందు విని కాని యీనాఁ డుపన్యసింపఁదలఁచుకొనలేదు.
వృథాయాస మెందులకు? (ఊరకుండును)

సంశయాత్మ:—అయ్యా! మీరు పరోపకారచింతతో
వచించు సంగతు లన్నియు మామదికి నెక్కినను, ఎక్కకపోయి
నను ఎక్కినట్లే యనుకొనుఁడు. నా మొదలగువా రెంతయత్నించి
బోధించినను దేవయోనివిశేషులలో నేమి, తదితరులలో నేమి
నా యభిప్రాయము నొకరు గాకున్న మఱియొకరేని కొంచెమై
రు పాటింపకున్నారు. పైపెచ్చు మిమ్మే కాక మీపక్షమున
ం మమ్మునుగూడ నవహాస్యము చేయుచున్నారు. మాకెల్ల

రకు విసువుపుట్టి అందులోఁ గొంచె మిందుల కనుకూలింపఁదగిన
వారి నందఱిని వెంటఁబెట్టుకొని వచ్చితిమి. వీరిం గూర్చి తామే
యుపన్యసింప వేఁడుచున్నారము.

ఉప :—ఓహో ! మీ వంటి సన్మిత్రుఁ డొకఁడుండఁ
జాలఁడా ! అనుపయుక్తులు వేయిమంది యున్న నేమిలాభము?
ఆ మధ్య మీ రేదో యుద్ధము చూచుట కేఁగి తప్పిజారి తగిలిన
తుపాకిదెబ్బచే మృతిచెందితిరని విని నేను బొందినపరితాప మిం
తింతకాదు. వినిపించలేదు గాని యా విచారమును సూచించు
నొక పెద్దవ్యాసమునుగూడ వ్రాసితిని. ఆహా! యేమి నాయదృ
ష్టము ! మీరు సజీవులై మరల నన్నానందింపఁజేయుచున్నారు !

సంశె :—(తనలో) ఈయన మాటలన్నియు వ్యుత్పత్తి
శూన్యములుగనే యుండును. పాపము ! విద్యాప్రవేశము
తక్కువ. యోగ్యుఁడు మాత్రము కాకపోలేదు. (ప్రకాశము)
ఎవరో చెప్పినమాట మీ రేల నమ్మవలెను ? మన మమరు
లముకదా ! మనకు మృతి యెట్లు సంభవించెడిని ?

ఉప :—ఓహో ! మీకు నా మతమే తెలియలేదు.
ఇక్కడమునసే మీ యుపదేశము వారల కెవరికిని నెక్కకుండ
వచ్చును. నే నమరత్వమును గిమరత్వమును నమ్మువాఁడను
గాను. భూలోకము మీరు చూచివచ్చినవారే కదా ! మీ
కిప్పటికిని ఈ చేదస్త మేల వదలకుండవలయును ? అందుఁ గొన్ని
భాగము లేస్థితినుంచి యేస్థితికి వచ్చినవో చూడుఁడు. దాని

కంతకును మూలము "పూర్వాచారములు వదలుట. జాతిమత ద్వేషములు పాటింపకుండుట" అను నీ రెండే సుఁడీ!

సంశ :—నేనేమో అంబరమార్గమున నుండి యుద్ధములు చూచితినే కాని దేశస్థుల మంచిచెడ్డ లంతగా గుఱితించలేదు. ఆ యుద్ధములైనను నాకు, మన గ్రంథములలో నుండు యుద్ధములవలెనంత మనోహరముగా నుండక యేదోయొక మాదిరిగా నుంటచేఁ జూడఁ బుద్ధి పుట్టినదికాదు. బలమున్నను బలము లేకున్నను, తెలివి యున్నను తెలివి లేకపోయినను తుపాకి దెబ్బ తగిలినంతమాత్రమునఁ జచ్చుటయే కాని విశేషమేమియును లేదు. భూమిలో భారతయుద్ధానంతరము మనము చూడఁదగినవి లేనేలేవని నా యభిప్రాయము. కొందఱు రాజపుత్రు లప్పుడప్పుడు యుద్ధములు చేసిరి కాని యవియైనను మంత్రశాస్త్రాదికము లేకుండుటచేఁ బౌరుషమాత్రప్రథితములే కాని మనబోఁటులు మెచ్చుటకుఁ దగినవి కావు. నారదుఁడు "యుద్ధము యుద్ధ"మని యెన్నిసార్లు పిలిచినను వినిపించుకొనుటయే లేదు. అదే మెఱుఁగు. పోయి చూచిన విశేషముమాత్ర మేమున్నది?

ఉప :—ఓహో! మీ చేదస్తము మఱియును నానాఁటి కధిక మగుచున్నది కదా! మంత్రశాస్త్రము లనికూడ నున్నట్లు చెప్పుచున్నారే! ఇఁక మిమ్మెవరు బాగుచేయనేర్తురు? మీరు నావలెనే కొంతకాలము భరతఖండములోనుండి యచ్చటి బుద్ధి

మహద్గ్రేసరుల యిప్పటియుపన్యాసములు విన్నపిమ్మటఁగాని మీకీ వెఱ్ఱి వదలదు. మనమేమో అమృతము త్రాగుటచేఁ జావు లేనివార మని యుప్పొంగినట్లే మీరు చెప్పు తక్కిన సంగతులు గూడఁ గన్పట్టుచున్నవి. ఒక్క యీ విషయమే మీమది కెక్కున ట్లుపన్యసించి బోధించెదను జూడుడు. ఈ అమృతము గరుత్మంతుఁడు దొంగిలించి కొనిపోవుట మన మెఱుఁగుదుము కదా! అప్పుడు కొంచెమో గొప్పో సర్పము లద్దాని ననుభవించినట్లే మన మెల్లరము నొప్పక తప్పదు. అయ్యవి చిరకాలము జీవించుచున్నవా? అట్లనే మనబ్రదుకును గాఁగలదు. "అట్లేని సరిగా ముప్పదిమూఁడుకోట్ల దేవత లెప్పటికిని నుండుట కేమినిమిత్త" మని మీరు శంకింపవచ్చును. ఇందులోఁ గొందఱుపోయిరేమో? అంత సరిగా లెక్కచూచినవా రెవరున్నారు? ఈ సమాధానము మీమది కంతగా నెక్కకపోవచ్చును. ఇప్పటి కింతకన్నఁ జెప్పవలసిన యవసరము లేదు కావున నింతతోఁ జాలించుచున్నాను. భూలోకములోని జీవరాసులు "ఎనుబదిరెండుకో"ట్లన్నట్టె యిదియును ఉన్మత్తప్రలాప మని మీరు భావించుకొనుఁడు.

సంశ:—(తనలో) ఈయనతో నెదురు చెప్పుటకన్న నూరకుండుట కొంత మెఱుఁగు. ఏదో చెప్పికొనుఁగాక. (ప్రకాశము) చిత్తము. వీరేఋషిబాలకులు, వీరినిగుఱించి బోధింపుఁడు.

ఉప:—ఓహో! వీరికి నాగరికత బొత్తిగా నుండదు. వీరిపూర్వులే మన కీజాతిమతాదిద్వేషముల నాపాదించినవారు.

వీరల కెంత బోధించినను చెవిటివానిచెవిలో శంఖ మూఁదినట్లే. అయినను సంఘసంస్కర్తల కూరకుండుట తగదని యించుక వచించుచున్నాను. మొగములనిండ భస్మములును, మెడలలో రుద్రాక్షతావళములును, సీరుకావి వస్త్రములును, జందెములును, పిల్లజుట్లును మొదలైన బూర్వవైఖరులు వీరిని బాడుచేయుచున్నవి. కాన, నయ్యవి వదలినవిమ్మటంగాని వీరి కించుకయు మనము బోధింపవలసియుండదు. ఇంతయు నప్పుడే వీరు వేదశాస్త్రము లభ్యసించి తద్విహితదుష్కర్మములు సత్కర్మము లను బుద్ధితో నన్నియునుగాకున్నఁ గొన్నియైనను నాచరించుచున్నట్టులున్నారు. వీరు వినుటకు మా యభ్యంతరము లేదుగాని వీరెనిం జేర్చుకొన్నచో మన సంఘసంస్కరణము తుదిముట్టదు. భూలోకములో వైదికపండితులన్‌గాని, మతాచార్యులన్‌గాని చేర్చుకొనకయే బుద్ధిమంద్రగేసరులు చక్కఁగా సంస్కరించి దేశమును మహోన్నతదశకుఁ దెచ్చియున్నారు.

ఋషికుమారులు :—అవును మమ్మున్ జేర్చికొన్నచో మీ యాటలు సాఁగవు. మేమైనను మీ తెల్వితేటలు చూచి వెళ్లుటకే వచ్చితిమి కాని మీవలన బాగుపడుటకు రాలేదు. వేదాధ్యయన మొనరించి తదంగములు చక్కఁగాఁ బఠించి బ్రహ్మచర్యవ్రత మొనరించి స్నాతకవ్రతానంతరమున విధివిహితముగ వివాహమాడి యావజ్జీవాగ్నిహోత్రులమై పరిశుద్ధమ్ములగు సిలోంఛాదివృత్తులచేఁ గాలము గడపి పరమాత్మసాక్షాత్కార సామ్రాజ్యమునందఁబోవు మాకు మీమాటలు నచ్చక

పోవు టొక్కటే దోసముకాని యంతకన్న వేఱేదియును నుండదు. కావునఁ గేవలవిశుద్ధాంశబోధకమ్ములగు మీ యుపన్యాసములు విని మేము బావుకొనవలసిన దేముండును? "శ్లో. లజ్జా మేకాం పరిత్యజ్య త్రైలోకీ విజయీభవేత్." మీ యిష్టము వచ్చినట్లు త్రోఁగుదురుగాక. "శ్లో. కథాపి ఖలు పాపానా మల మశ్రేయసే యతః" కనుక మేమిప్పుడే పోవుచున్నారము. (నిష్క్రమింతురు)

ఉప:—(తనలో) ఇఁక బ్రదికితిమి. వీరలు చూచుటకుఁ జిన్నవారలే యైనను మిరియపుగింజలవంటి వారు. మాట సాఁగనీయక చిక్కుపెట్టెదరు. వీరి కుయుక్తులకు సమాధాన మెవఁడు చెప్పఁగలఁడు?

సంశ:—(నవ్వి) అయ్యా! చిత్తగించితిరా? ఇదేరీతిగా నందఱును మమ్ము వేధించుచున్నారు. ఇదుగో వీరే పితృదేవతలు.

ఉప:—అట్టివారంద్రు లేచిపోయినందులకు మీరు శంకింపనలదు. వారలు దుష్పాండిత్యమును వదలనేరరు. మనమందఱము భ్రష్టులమని వా రనుకొందురు. వారికిఁ బైపెచ్చు ప్రపంచములో నెవరును దమమాత్రము చదివినవారు లేరని గర్వము. వారి చదువులు చిలుక చదువులని వేసారు నొక్కివక్కాణించియే యున్నాము. మన మిట్టివారి ధిక్కారములు లెక్కింపక యీ సంస్కరణ భారమును వహింప వలయును. వీరిం గూర్చి యవకాశ మైనప్పుడు మధ్యమధ్యను ముచ్చటించుచునే యుండె

దను గాన్ప ప్రకృతాంశమునకు వర్తము. ఓహో! పితృదేవత
లారా! మన మియ్యెడఁ గొన్ని క్రొత్తమార్పులు మార్చుకొన
కున్నచో నెందులకుఁ బనికివత్తుము? ప్రప్రథమమున మీకు
శ్రాద్ధభోజనములు మానవలెను. ఎప్పుడో సంవత్సరమున కొక
సారి మీవారలు పెట్టెద రని నోళ్ళు తెఱచికొని గోతిదగ్గఱ
కక్కులవలెఁ గూర్చుండక దేవుఁ డనుగ్రహించిన కరచరణాదు
లతోఁ దగిన పాటుపడి జీవింపుఁడు. పాటువిషయమున కుడియెడ
మలు చూడక యేదియేని యవలంబింపుఁడు. ఈ యుపన్యా
సాంతమున లాభకారులగు వృత్తులు కొన్ని మీకు వివరింపఁ
బోవుచున్నాను. పూర్వాచారములు మానుట యొకటే మీకు
నే నుపదేశించెడి మహామంత్రము. దానివలననే మీకుఁ బర
మోన్నతదశ లభింపఁగలదు. మీ జీవనము భూలోకాధీనమై
యున్నదని నేను వేఱే చెప్పవలసిన యవసరము లేదుకదా!
అక్కడి యిప్పటిమార్పు మీకు తద్దినములు పెట్టకపోవుటచేతనే
కొంత తెలిసియుండవచ్చును.

పితృ :—(తనలో) ఈయన చెప్పెడిమాట లేమంత
బాగుగా యున్నయవికావు. వేదశాస్త్రవిశ్వాసము బొత్తిగా
లేనట్లు కనుపట్టుచున్నది. సోమరితనము మాను మనుటకు వెఱ్ఱి
సోది యిది యంతయు నెందులకో? అట్లనే యని యొప్పుకొం
దము. మన కేమి? ఇంతకును; ఈయన చెప్పినట్లేదో భూలోక
మున మార్పు తటస్థించినట్లే తోఁచుచున్నది. తర్పణాదిక
మట్లుండ, తద్దినముల సంగతి విరళమైనను, శ్రాద్ధము లేనియు

మునుపటివలెఁ గానరాకున్నయవి. (ప్రకాశము) చిత్రము. మేము మీ యుపన్యాసపు విధులకు లోఁబడు వారమే.

ఉప :—ఊరకే చిత్తమనుట గాదు. త్వరలో నేదో యొకవృత్తిలోనికి దిగవలెను. మీయిప్పటి పయిదంభాచారవేషములు ముందు మార్చుకోవలెను. ఊరక సోమరులై మీ వంశస్థులకు స్వప్నాదులలోఁ గనుపట్టి ద్రవ్యవ్యయము లొనర్పింపకుఁడు. దానివలన వారు నానాఁటికి హీనదశకు వచ్చుచున్నారు.

సంశ :—అయ్యా! వీరే గంధర్వులు. వీరింగూర్చి యనుగ్రహించి బోధింపుఁడు. వీరి వృత్తి దేవరవారెఱుఁగనిదికాదు కదా!

ఉప :—వీరలవలననే మనలోకమునకు ముప్పు మూఁడుచున్నది. ఓహో! మహాగంధర్వులారా! నా మాటలు మీకు విరుద్ధములుగాఁ దోఁచునేమోకదా! మీవిద్య మంచిది కాదని నా యభిప్రాయము కాదు. సంగీతమునందలి గౌరవము పూర్తిగాఁ జెడఁగొట్టినారు. యీ యేఁడువాండ్రవెంటఁ దాళములు వాయించుకొంచు "తత్తత్త; దిద్దిద్ది" యని శబ్దములు గొలుపుచు నాడించు టట్లుండ నట్టిసమయములయం దాలతాంగులం జూచి వరించెడి బోజుంగులను మీరు జామాతగానో తండ్రిగానో మఱిదిగానో చూచి గృహములకు నిరభ్యంతరముగ రానిచ్చుచున్నారు. ఇదివఱకీ స్వర్గస్థితి బాల్యములో నుంటంబట్టి సభలకు మీ స్త్రీలరాక కొప్పుకొన్నను నిప్పటిమార్పులలో దానింగూడ ఖండితముగాఁ దప్పింపఁబోవుచున్నారము.

భూలోకమున మీ జాతిపురుషు లనేకు లిప్పు డెట్టి పదవులలో నున్నారో మీరొకసారి పోయినచోఁ దెల్లముగాకతీరదు. వార లందఱును దమ యాఁడువాండ్రకు నరగా సానులుగా నున్న వారలకుఁ దగినంత బోధించి తక్కినవిషయము లట్లుండ "నాగరా" కట్టుటకూడ వలదని కట్టుఁబా ట్లేర్పఱచియున్నారు. మీకు బుద్ధిలేదా? మీరిఁక నెంతకాలము స్త్రీదాసులై వార లొనరించు హేయకృత్యములను సహించుచు జూదరులై త్రాగుఁ బోతులై పాడయ్యెదరు? జాతిమతద్వేషములు మానుకొనుట కేర్పఱచుకొన్న మేము మీ రీదుర్వ్యాప్తిని వదలినంతమాత్ర మున మాతో సరిగా మిమ్ము గౌరవింప నిశ్చయించినారము. దేవేంద్రుఁడు మొదలైనవారు మీ స్త్రీల మోమోటమి వలన నిదివఱకే మిమ్ము రహస్యములో నట్లు గౌరవించుచున్నారు కదా! అది బాహాటముగాఁ జేయుటకు మీరు యత్నింపుఁడు. వేవేగఁ బోయి భూలోకమునఁ బాఠశాలలలోఁ బ్రవేశించి పరీక్ష లిచ్చివచ్చితిరేని యేదేని యిక్కడనే యుద్యోగములోఁ బ్రవేశింపవచ్చును. లేదా వర్తక మంతకన్న శ్రేష్ఠమైనది గనుక దానిలోనైనఁ జేరవచ్చును. లాభకారులైన వర్తకములు కొన్ని ముందు చెప్పఁబోవుచున్నాను. ఇందులకు పూర్వాచార పరాయణులగు మీకులస్థులు కొందఱు సమ్మతింపక పోవచ్చును. వారిని మీరు లెక్కింపకుఁడు. మీ స్త్రీలనుగూడ ముందు చెప్పఁబోవుచొప్పున మీరు దిద్దుకోవలెను. లేనిచో మీకు గౌరవము దక్కదు. కన్నులు తెఱవవలెను.

గంధ :—(తమలో) మే మెప్పుడేని కన్నులు మూయు చున్నంగదా! ఇప్పుడు తెలియవలసినది. ఇది యేదో వెఱ్ఱిగా నున్నది. (ప్రకాశము) చిత్తము.

ఉప :—ఊరక చిత్తమనుటగాదు. త్వరలోఁ బనిచేయ వలెను. మీ కింతవఱకు వచ్చియున్న విద్య సామవేదము లోనిదే కదా! అందుచేఁ బూర్వాచారుల మతమునఁగూడ మీకు వేదాధికారముగూడ నున్నట్లు తేలుచున్నది. ప్రప్రథమ మున దూరదేశము పోయి యన్యభాష లభ్యసించుట కష్ట ముగాఁ దోఁచినచో వేదములేని యభ్యసింపుఁడు. అవి యచ్చు పడియే యున్నవి. స్వరముతో నంత యవసరములేదు. "వేదము వలన మేము చేయవలసినపని యేమున్న" దని మీకు శంకింప వచ్చును. మీ కేగాక వానివలన నితరులకును నంత ప్రయోజ నము లేకుండుట నిక్కమే యైనను "మాకే వేదములు వచ్చు" నని చెప్పెడి యీ ఋషిపిశాచములను వెక్కిరింపనైనను ఉప యోగపడెడిని. ముందు వీరల నడఁగఁద్రొక్కిన పిమ్మటఁగాని మనసంఘము వృద్ధిలోనికి రానేరదు. "మనమవి చదివినచో దుంపనాశనమగుదు" మని మీ జాతిలోఁ గొందఱు మూర్ఖులు మిమ్ము భయపెట్టవచ్చును. శకుంతల మీ జాతిలోనిదే యని మీ రెఱుఁగుదురు కదా! ఆమెకు వేదము ఘనాంతమువఱకుఁ గాకపోయినను సంహితవఱకు వచ్చు నని యిప్పటివా రనేకులు వ్రాసియున్నారు. ఇంతకన్న మీకు ప్రమాణ మేమికావలెను?

సంశ :—అయ్యా! వీరే అచ్చరలు. వీరిఁగూర్చి యను చితములు నిర్ణయింపుఁడు.

ఉప :—ఏహా! ఇది "ఎలుఁగుబంటికితంటసము" నంటిది కదా! అయినను సంస్కర్త లూరకుండఁగూడదు. ఓహో! సోదరీమణులారా! భూలోకములోని వేశ్యలకన్నను మీయవస్థ యిప్పటి మా మార్పునుబట్టి కడు గహనముగా నున్నయది. మీరు సముద్రమథనకాలమునఁ బుట్టి రను పురాణవాక్యము లయుక్తికము లగుటచే నంత నమ్మదగినవిగాఁ గనుపట్టవు. వారలకుఁ దండ్రిమాత్రమే నిర్ణయింప నశ్యుఁడు గాఁడు గాని మీకుఁ దలిదండ్రు లెవ్వరును నట్టివారే. ఇట్టి తలిదండ్రులు లేని దిక్కుమాలిన పిల్లలను భగవంతుఁ డెందులకు సృష్టిచేసెనో నాకుఁ దెలియరాకున్నయది. ఆ మహానుభావుఁడు సృజించిన పదార్థము లన్నియు ననఁగాఁ గడు నపకార మొనరించు తేలు మొదలుకొని యేదో ప్రయోజనము లేకయుండవు. ఇది మా యాత్మవేదసిద్ధాంతము. అట్టి మాకు మీ యుత్పత్తికిఁ దగినసార్థక్యము కనుపట్టదు సరికదా! పైపెచ్చు మీవలన ననేకకష్టములు జనులకుఁ గలుగుచున్నవి. అక్కటా! హేయాతిహేయమ్మగు మీ వృత్తి దలంచుకొన్నచో మీకు సిగ్గు లేదుకదా! మీకై యాశపడి విప్రులనేకులు యజ్ఞములు చేసెద మని చెప్పి గృహస్థులను యాచించి పీడించుచున్నారు. వృథాగా గోవు మొదలైన జంతువులను చిత్రవధగాఁ జంపుచున్నారు. కొందఱు భూములు మొదలైనవి విక్రయించి యా ద్రవ్య మాదుష్కర్మ

ములకు వెచ్చించుచున్నారు. భూలోకమున నఖండనాగరికత వర్ధిల్లినను ఇప్పటికిని గొందఱు పూర్వాచారపరాయణులై పాపకృత్యములను మానకున్నారు. దాసి మొదలంట నశింపఁ జేయుటకు ముందు మీరీవృత్తి వదలుకొనక తప్పదు. ఆటిచె ట్లున్నంతవఱకును మద్యపాన మడఁగంటదు. మీతోపాటు నేము హవిర్భాగములు వదలుకొనుచున్నారము. ఇందులకు స్వార్థపరులైన దేవేంద్రాదు లంగీకరింపక పోవచ్చును. మీ రవి లెక్కింపవలదు. నానాఁటికి మన సంఘ మొక్కటవ్వై వారి మాటలు పిచ్చికూఁతల క్రిందఁ బరిణమింపఁగలవు. అయ్యో! మీరింతకు మున్ను కనుచున్న సంతానములఁ దలఁచికొనుఁడు. భూలోకమున నిర్బంధవైధవ్య మనుభవించు దుశ్శీలల సంతతిం బలె నిద్యాదియును జావఁగా మిగిలినది మొగులపాలే యగు చున్నది. ఈ దేవతల కట్టుఁబాట్లకు జంకి యా పిల్లల సక్కటనే విడిచి వచ్చుటయే కదా! ఇంత యనర్థము కలిగించుచున్నది. ఇఁక మా స్త్రీలకే నేము సంతానము నంగీకరింపనున్నారము. కనుక "త్రింశత్కోటి" యను సంఖ్యతో నియమ మవసరము లేదు. మీరు పూర్వమువలెఁ బక్షులకో మఱియొకరికో మీ పిల్లల నిఁక నర్పింపక యిద్యోడకే తీసికొనివచ్చి బాల్యవివాహముమాత్రము చేయక ప్రౌఢయైన పిమ్మటఁ దగినవరుని కిచ్చి పెండ్లి చేయుఁడు. తపోవిఘ్నములు మొదలైన కార్యములకు మిమ్మాసింపవలసినయవసరము లేదు గాన మీరుకూడఁ దగిన వరులం బెండ్లియాడి సంసారిణులుగా మాఱుఁడు. ప్రకృతస్థితిం

బట్టి మీ కులస్థులనే పెండ్లియాడుచుంటిరేని ముందుముందు నాగరికత భూలోకమునందువలె మనకుఁగూడ నతిశయించెనేని జాతిమతవైషమ్యములు లేక పెండ్లి చేసికొందురుగాక! అక్కటా! రంభా! నీ తత్త్వము దలంచుకొన్నచో నీయొడలు నీకుగాదా! అయ్యో! హారిణీ! నీస్థితి స్మరించుకొన్నచో నీకు భీతి వొడమ కున్నదా? అమర్త్యత్వము మిమ్మెంత పీడించుచున్నదో చూడుఁడు. మీ యాంతరంగిక బాధలు మీ రెఱుఁగనివి కావు కదా! ఆ వ్యాధులకుఁ దలఁకి శరీరత్యాగమేనిఁ జేయుటకు స్వాతంత్ర్యము లేనిమీజీవన మెంత పరాధీనముగా నున్నదో చూడుఁడు. ఇఁక మీరు యజ్ఞాదులు చేసివచ్చిన వైదికపిశాచములతోడఁగాని యుద్ధములలోఁ జచ్చిన రాచపీనుఁగులతోఁ గాని స్నేహింపకుఁడు. భూలోకములోఁ దగినకట్టుదిట్టము లేర్పడుచునే యున్నవి గాన నట్టిదురవస్థ మీ కిఁకఁ దటస్థింప దనియే నా నమ్మకము. మీ రిదివఱలో నభ్యసించిన సంగీతాభినయకామశాస్త్రములలో మూఁడవదిమాత్రము త్యజించితిరేని సంసారిణులుగా నుండవచ్చును. అంతవఱ కీపైని మాకులకాంతలకుఁగూడ మేము చెప్పించుచునే యుందుము. మీరు నీతిని దెలుపఁదగు గ్రంథములు కొన్ని చదువవలసియున్నది. అంతతో మీరు సంసారిణులుగా మాఱుట కేయభ్యంతరమును నుండఁగూడదు. "ఇంతకాలము వ్యభిచారిణులమై యిప్పుడు సంసారిణులుగా నెట్లు మాఱఁగూడు" నని శంకింపవలదు. మనకన్న వేయిరెట్లు నాగరికత వృద్ధిగలదేశములలోని స్త్రీలు కొందఱు

విశ్వస్తావస్థలో నన్ను కొంతకాలముండి పడపడి కుటుంబినులుగా మారుచున్నారు కారా? ఎప్పటికేని దుష్కృత్యము మాని యోగ్యతను సంపాదింపవలయు ననియే కాని సదా యొకటే తీరున నుండవలయు నని భగవంతుని యభిప్రాయ మైనట్లు నాబుద్ధికిఁ గన్పట్టదు. మార్పులవలనఁగాని దేశమునకు మహో న్నతస్థితి గలుగదు. అట్లని "ఇదివఱకు నోటితో భుజించువారు తద్వ్యతిరేకముగా భుజించుటకూడ నొకమార్పే యగునా?" అని మీరు శంకింపవచ్చును. అట్టి పెంకిశంకలకు మే ముత్తర వాదులము గాము సరిగదా! వా రెంత మహాపండితులైనను మా దృష్టికి గడ్డిపరకకైనఁ గొఱగారు. చదువు వేఱు సద్గుణ ములు వేఱు. మీ రీపాటికి సిగ్గు దెచ్చుకొనుఁడు. అట్లని సభల లోనికి నచ్చి పురుషులతోపాటు వ్యవహరింపఁగూడ దని మా యభిప్రాయముకాదు. అట్లయినచో మీచదువునకు సార్థక్యమే యుండదు. ఇఁక నొకటి మీ రిప్పుడు చదువుకొన్న చదువు దేశమును బాగుచేయుట కించుకయుఁ బనికిరాదు. అందులో సంగీతాభినయములు మాత్రము పనికివచ్చు నని యిదివఱలోఁ జెప్పియే యున్నాను. ఈపైని మీరు లోకజ్ఞానము వృద్ధి పొందింపఁదగు పుస్తకములు కొన్ని చదువవలెను. అట్లని పురా ణాదులు చదువవలసినదని కాని, కావ్యాదులు చదువవలసినదని కాని మా యభిప్రాయముకాదు. ఇందులో మొదటివి విరుద్ధ గాథలతోడను, రెండవయవి యలంకారాదులతోడను నిండి జగ మునకు మహోపకార మొనరించుచున్నయవి. దానికిం దగిన

పొత్తములు ముందు వివరించుచున్నాను. ఆ పుస్తకములైనను అక్కడక్కడ స్వకపోలకల్పితములు గాకున్నను కొన్ని యలంకారములే కాక కచాద్యవయవవర్ణనలలో నాయాకవులు పొరపాటు చేతనో చిరకాల పూర్వాచారపరిపాటిచేతనో చేసియున్నారు. ఆ భాగములు వదలివేయవలయును. "ఇట్లనుటకన్న సంతహేయములగు నవయవములే మనము వదలుట కొంత సులువు గాదా!" అని కొందఱు శంకింపవచ్చును. వారికి నే ముత్తరవాదులము కామని తిరిగియుఁ జెప్పనక్కఱలేదు. వీలైనచో నవియును వదలుకొందురుగాక! ఆ పుస్తకములకు మీకు గురువులవసరము లేదు. వ్రాసిన కవులు విజాతీయభాషలలోఁ బరిపూర్ణులు గాకున్నను కొద్ది గొప్ప పరిచయము కలవారు గనుక సులభశైలిని వ్రాసియున్నారు. ఇపుడు వ్రాయుచున్నారు. ఇంకను వ్రాయనున్నారు. ముఖ్యముగా జాతిమతాదివైషమ్యము మీరు వదలవలెను. ఒకవేళ మీరు "మే మిదివఱకే యా వైషమ్యమును పాటింపక సోమయాజులు మొదలు సాహెబయ్యవఱకును చేర్చికొనుచునే యున్నారము" అని కుయుక్తి చెప్పవచ్చును. ఏమైనను అది వ్యభిచారమే కనుక నాదరింపఁదగినది కాదు. "ఇదిమాత్రము వ్యభిచారము కాదా! ఆ శబ్దమునకు ముఖ్యార్థము కట్టుదప్పుటయే కదా! పళ్లు రాలఁగొట్టుకొనుట కేరాయియైన నొకటే. ఏదో యొకవ్యభిచార మిప్పుడు మాత్రము తప్పినదా?" అని కొందఱు మీకు దుర్బోధ చేయవచ్చును. అది శుద్ధశుష్కతార్కికులొనరించెడి దుర్వాదము

గనుక మన మట్టియుక్తులు పాటింపఁగూడదు. "వేశ్యావ్యభిచారముకన్న మతవ్యభిచారమే మెఱుఁగని యంగీకరించినచో నీతి వృద్ధియగుట నిక్కమేనా ?" అని మీరు శంకింపవచ్చును. ఆఁ ! నిక్కముగా మతవ్యభిచారమువలన నీతి యధిక మగు నని మేము నిలిచి చెప్పఁగలము. అట్లని యెల్లరును నీతికిఁ గుదురులే యగుదు రని చెప్పవలనుపడదు. ఎంత సంస్కరించినను కొంద ఱట్టు మఱికొంద ఱిట్టు నుండకమానరు. ఏది యెట్లయినను మీ కులములో మీ వంటి పేరుగలసానులు నలుగురైనను గుదు తగినపని చేసినంగాని యీ వ్యభిచార మడుగంటదు. "అట్లయిన మీలో వ్యభిచారము నెట్లు పోఁగొట్టుకొందురు ?" అని మీరు శంకింపవచ్చును. దానికి మీరే ప్రథమకారణము గనుక దీనితో పాటుగా నది కొంత తగ్గఁగా మిగిలినది విధవావివాహవిధి స్థాపనచేఁ దగ్గింప నెంచినారము. ఇట్లు తగినంతప్రయత్నము చేయక పోయినచో మనస్వర్గమున కున్నతస్థితి కలుగ నేరదు. బృహస్పత్యాదు లిప్పుడు మన మేదో యున్నతస్థితిలో నున్నారమని పలుకుచున్నారే కాని గురిగింజసామెతగా మనదోషము లించుకయుఁ దెలియకున్నారు. మనకుఁ దినుట కన్న మైనను లేదు కదా ! "కల్పవృక్షకామధేనుచింతామణ్యాదులు మనకుఁ గోరికల నిచ్చుచున్నవి కదా !" అని కొందఱనవచ్చును. ఒకవేళ వాదసౌకర్యార్థము క్షణకాల మవి యట్టివియే యని యొప్పుకొన్నను, ఇంతమందికి నొక కామధేనువువలనఁగాని యొక చింతామణివలనఁగాని యేమితృప్తి కలిగెడిని ? ఇఁకఁ గల్పవృక్ష

ములు. అవియేని లెక్కకు మిక్కిలి లేవు. "కల్పవృక్షో దదాత్యేవ" అనుటవలన నెఱిఁగినయావి కాదు కదా! అట్టియావి వలన నేమిప్రయోజనము? ఇట్టి దోషములు చూపఁబూనినచో నెన్నియో పుటలు నింపవచ్చును. గాన నింతటితో విరమించుచున్నాను. మీకు భగవంతుఁడు పాతివ్రత్యసంపాదనార్థము తోడ్పడుఁగాక!

అప్స:—(తమలో) ఈయన చెప్పుసంగతు లన్నియును కఱకుకన్నను గంగిగోవును జేయుసామెతగా నున్నయవి. కానిమ్ము. అట్లనే యొప్పుకొందుము. మన మీయనపై యుక్తులను జెప్పఁ గలిగినను నీసభ్యు లంత యాదరింపరుకదా! (ప్రకాశము) చిత్తము, తమయాజ్ఞ శిరసావహించుచున్నాము.

ఊర:—చిత్త మన్నంతఁ బ్రయోజనము లేదు. మీలో రంభయును, ఊర్వశియును, మేనకయును, వరూథినియును ముఖ్యముగా నీకార్యమును బూని పురుషులకన్న నెక్కుడుగ నిలిచి ధైర్యస్థైర్యములతోఁ గృషిచేయవలెను. మీరు పురాణవైరాగ్యమన్న ట్లిక్కడి దిక్కడనే దులిపి యొక్కతె నలకూబరుని యుద్యానవనమునకును, వేఱొక్కతె పురూరవుని సౌధమునకును, మఱియొక్కతె విశ్వామిత్రుని తపోవనమునకును, నింక నొక్కతె ప్రవరాఖ్యుని యగ్నిహోత్రశాలకును బోనెంచినచో సంస్కరణ మగ్నిసంస్కరణ మగును. మీ రందఱును మా స్త్రీలతోపాటు సమాజము లేర్పరచుకొని యాయావిష

యముల నుపన్యసించుచు నరమరిక మాని యుపన్యాసముల వలనఁ దేలిన సారాంశముల నాచరణలోనికిఁ దేవలయును. మేము సంశయింపని జాత్యాదులవిషయమై మీరు కొంచెము సంశయించుచున్నట్లు మీ రింతకుమున్ను పలికినమాటలవలన సూచన యగుచున్నది. కాని, అది మీకుఁ బూర్వాచారములు తలకెక్కి చేయుచున్నదుర్బోధనే కాని వేఱు కాదు. ప్రప్రథమమున జాత్యాదిభేదము లెవ్వియును లేనియట్లును, పిదప స్వార్థపరులచే నియ్యవి యన్నియుఁ గల్పింపఁబడినట్లును వేదములవలననే తెలియవచ్చుచున్నది. అవి మీ పురుషు లభ్యసించి మీకు బోధింపఁబోవుచున్నారు గాన వానిని గుఱించి యిప్పుడు చెప్పక విరమించుచున్నాఁడను. కొందఱు "వేదములలో నుండుఁగాక లేకపోవుఁగాక దీనికి వేద మెందులకు? శిశువు పుట్టినప్పుడు లేని కట్టుఁబాటు లనేకములు పెద్దయైనకొలఁదిని గలుగుచుండుట లేదా! అట్లనే క్రమముగా నాయాకట్టుఁబాటు లేర్పడవచ్చును." అని చెప్పి సంతసించుచున్నారుకాని వారి కుయుక్తులు కేవల నిర్వ్యాజ పరోపకారపారీణులు వినఁదగినవియు, జవాబు చెప్పఁదగినవియుం గావని మీకిదివఱకే బోధించి యున్నాఁడను.

సంశ :—అయ్యా! వీరే పిశాచరాజులు. వీరివృత్తి తమ కెఱుఁగనిది కాదు.

ఉప :—ఓహో? వీరియవస్థ దలఁచినచో నాకు నోరు రాకున్నయది. ఓసహోదరులారా! ఓపిశాచమహాశయులారా!

నే నేమిసేతును. నే నీసంస్కరణము భూలోకము ననుసరించి చేయఁబూనుకొన్న సంగతి మీ రెఱిఁగియుందురుకదా! అచ్చటివా రెవ్వరును మీయునికి కొప్పుకొనుట లేదు. ఏమంటిరా? మిమ్ము నొప్పినతోడనే మంత్రవేత్తల నొప్పవలెను. దానితో పాటు మంత్రములు, వానితో వేదములు, వానితో శాస్త్రములు, స్మృతులు, పురాణములు మొదలైనవి ౘాటితో దబ్బనములు కాకతీరదు. మా సంస్కరణ మాత్మవేదానుసారముగా నుండు. అట్లని వెనుకటి వెవ్వియును నమ్మ మని మీ రనుకొనవలదు. మన స్థితిగతులంబట్టి యోజించి యందులోఁగల సంగతులు విరుద్ధములు గానిచో నంతవఱకు వేదాదికమే యననక్కఱలేదు, తందనపదములైనను స్వీకరింతుము. ఈ వేదమున కాత్మాంగములే యంగములు గాని శిక్షాదులవలె వేఱే యంగములు లేవు. ఇవి కడు సులభశైలిని భూలోకములోని బుద్ధిమద గ్రేసరులచే వ్రాయఁబడినవి. అవి యనుభవమున కించుకయు జంకవు. దీనినింబట్టి మీ యునికి సిద్ధాంతీకరింపఁబడదు. మీ స్థితినే మే మంగీకరింపకున్నప్పుడు మీ విషయమై సంస్కరణ మనవసరమేయైనను నించుక బోధించుచున్నాను. మీ రిప్పటి నుండి యీ పేరు దీసివేసికొని నాగరికత కనుకూలమైన నామము జాతిబోధకముగాకుండునట్లు ధరించి పూర్వమువలె నెల్లర నావేశింపక పూర్వాచారపరాయణులను మాత్రమే తగుమాత్రము పీడించుచు జీవింపవలయును. మీకు బుద్ధివృద్ధిగాఁదగు కొన్నిసంగతులు కలవు. నడినెత్తి పెంచుకొనుట, కనుబొమ్మల

మధ్య కేశములు పెంచుకొనుట మొదలగు సాధనములవలనఁ గొంత యున్నతస్థితికి వచ్చి యిప్పుడప్పుడు మా యుపన్యాసములు వినుటవలనఁగూడఁ గొంతనాగరికత హెచ్చుచేసికొని పవపడి యావేశించినచోట్లనేని మంత్రవేత్తలకు జంకక మా వలనే ప్రతిఘటించితిరేని యిప్పు డాక్షేపించుచున్న నేమే మిమ్మునుగూడఁ బూర్వాచారపరాయణత తగ్గిన ట్లూహించి సంఘములో ధారాళముగాఁ జేర్చికొందుము. నవనాగరికుల నావేశింపకపోవుటయే మీకు మొదటి యుపదేశము. ఒకవేళ నావేశించినను స్త్రీలనుమాత్రము చేరవలదు. ఏమంటిరా? అట్టియెడల నిష్కారణముగా నది కొంటెతనమని భావించి యా యబలను తాడింతురు. దానిపై మీ బాధకన్న నాబాధ యెక్కువై దుఃఖపడవలసివచ్చును. మనస్థితి యిప్పు డిట్లు మారినది గాని పూర్వము మహోన్నతదశలో నున్నదనుట కించుకయు సందియము లేదు. వేయిమాటలేల? ఆదికాలమున మహిషాదిమృగములకుఁగల నాగరికతయేని యిప్పుడు మన కున్నట్టులేదు. దీనికి ముఖ్యకారణము కట్టుఁబాట్లను హెచ్చించిన ఋషిపిశాచములే కాని వేఱుకాదు. మహిషాసురుని ప్రతాపము మీ రెఱిఁగినదే కదా! ఆయన దేవతలకు సవతితల్లి సంతతివాఁడే. ఆ స్థితి దలఁచుకొన్నచో పరోపకారపారీణుల కిప్పటిస్థితి యెంత శోచనీయముగా నున్నదో చూడుఁడు. ఇప్పుడనేకమతములై యొకరిం జూచిన నొకరు స్నానము చేయుట దగ్గఱకు దిగిన మనదురవస్థ నేమనవచ్చును? ఓహో? పూర్వా

చారపిశాచమా! మమ్మింకను నేలవేధించెదవు? ఏమంత నిన్ను గౌరవించుచున్నామని మమ్ము వదలకున్నావు? కాలు పట్టుకొని లాగినఁ జూరు పట్టుకొని వ్రేలాడెదవేమి? నీ ప్రభావము గలిగించు దురవస్థలు మావారు కేవలమూర్ఖతచేఁ బాటింపకున్నారు గాని, యెన్నెన్ని యున్నవి. అన్నింటికేమి; పూఁటకు గతిలేక "పేరు గొప్ప, ఊరు దిబ్బ" అన్నట్లు భూసురేంద్రుల మని పేరుపెట్టుకొన్న దరిద్రధ్వజము లొనర్చు హోమాదులలోని యాజ్యాదిహవిస్సు మా కన్న మగుట నీవలననే కదా తటస్థించుచున్నది. ఆ దిక్కుమాలిన మెతుకు లెప్పుడేని సరిగా నుడుకుచున్నవా? అవియేని అగ్నిగాఁ డెంగిలిచేయకుండఁ దెచ్చి యిచ్చుచున్నాఁడా? వాఁడు తినఁగా మిగిలిన యుచ్ఛిష్టమా మాకర్మము కాలి నేము తినవలసినది! అది పవిత్ర మని సాధించుటకు "ముఖం స్త్రీవహ్నా వాజినా" మని ధర్మశాస్త్రమా! ఆయెంగిలికే యొప్పుకొన్నను "శ్లో॥ కాకమాంసం శునోచ్ఛిష్టం స్వల్పం తదపి దుర్లభమ్" అన్నట్లు కడుపు నిండకపోవుటా! ఆహా! దైవమా! నన్నీ దేవతలలో నెందులకు పుట్టించితివి? ఇట్టి పరమమూర్ఖులు నీదృష్టికి సమ్మతు లెట్లైరి? ఇంద్రుఁడేమంత యోగ్యుఁడు? ఈతఁడు గౌతమునికొంప గూల్చుట నీ కంగీకారమేనా? ఇట్టివాఁడు మాకు రాజా? చంద్రున కంతమంది భార్య లెందులకు? ఇతనింబట్టియే కదా! తురుష్కులీవిషయమున మితిలేని వివాహము లొనరించుకొను టట్లుండ నిర్భయముగా నెందఱి పాతివ్రత్యమునో భంగించుచున్నారు! ఇతనికంటె దేవత

లలో యోగ్యుఁడు లేఁడనియా తురుష్కుల కీతని దైవముగా నేర్పఱచితివి ? ప్రపంచము పుట్టినది మొదలితఁడు దక్క గురు దారాపహరణ మొనరించినవాఁడు లేకున్నను నీతనినొక్కని నాధారము చేసికొని "దేవత లందఱును అపాత్రులే" అని మూర్ఖులగు కవులు మమ్ము నిందించుటయేని నీకుఁ గష్టముగా లేదా ? ఏమి కర్మమో ఆ కవులకు దీనింబట్టియేని "అకృత్యములు పూర్వకాలమునఁ దక్కువగా నుండెడివి" అని శోఁచక విపుదజ్ఞాన ముత్పన్నమై ఆయా యకృత్యములలోఁ గొందఱు కొన్నింటిని మఱికొందఱు మఱికొన్నిటిని నాధారముగాఁ జేసికొని తమయిచ్చకు వచ్చినట్లెల్ల మూర్ఖులకు బోధించి క్రొత్త యేర్పాటులు మొలకలెత్తింపఁ దదనుసారముగా మేముగూడ నెప్పటికప్పుడు మార్చికొనుచుంట నీకు న్యాయ్యమనియే తోఁచుచున్నదా ? కశ్యపున కిరువురు భార్య లెందులకు ? ఈ హేతువుననే కదా, రక్కసులకును మాకును వైషమ్య మెప్పటికిని వదలకున్నయది. బృహస్పతి యేమంత యోగ్యుఁడని దేవమంత్రిగా నొనర్చితివి ? అతఁడు శిష్యగృహీతయగు భార్యను మరల నంగీకరించుట యంత నింద్యముగాఁ దోఁచనిదే యైనను గర్భవతి యగునన్నగారిభార్యపై మదోన్మత్తుఁడై పడుటయేని గర్హ్యమని నీకుఁ దోఁచలేదా ? ఇంకను వీరియకృత్యములెన్ని లేవు ! అశ్వినులకు యజ్ఞభాగ మేల లేదు ? నిన్నన నేల? నీవును వీరిలోఁ జేరినవాఁడవే. శ్రుతు లెందుకు ? స్మృతు లేమిటికి ? పురాణము లడుగుకొని తినుటకా ? ఆయా యేర్పాటు

లను లోఁగనివారియెడల నియ్యావి యించుకయుఁ గనలనేరవు కదా? అట్టి వీనితో నేమిప్రయోజనము? తగులఁబెట్టనా? పై పెచ్చెన్నిదురాచారములు బోధించుచున్నవి! వజ్రాదులయం దంత గౌరవ మేమి? చాపరాశ్యయం దేల లేదు? సర్వజనోప యుక్తములైన వస్తువులకన్న నిరుపయోగవస్తువులయెడల నా ధిక్య మెందుకు పెట్టితివి? పశువులకన్న మనుజుల విశేష మేమి? అవి యెన్నియుపయోగములు చేయుచున్నవి! అందులో దున్న పోతులంబట్టి చూచుకొందము. ఆహా! ఇయ్యవి దుక్కి దున్నును. బండి లాగును. గోనెలు మోయును. ఇంకను లెక్కకు మిగిలినయుపకారములు వీనివలన నున్నవి. మనుజులజీవనమే వీనితో నున్నయది. వేయేలా? సృష్టికి మూల మియ్యవియే కదా! అందులకే కాఁబోలును కొంతకాల మేతద్వంశస్థుఁడగు మహిషాసురునకు రాజ్య మనగా స్వర్గాదుల నెల్లఁ బరిపాలనాయోగ్యములుగాఁ జేసియున్నాఁడవు. ఇచ్చినవాఁడ వట్లుంచక తిరిగియు దేవతల కిచ్చుటచే నీకరుణకూడఁ జంచల మని చెప్పవలసి వచ్చుచున్నది. ఓహో! గాడిద యని యెల్లరును నీచముగాఁ జూచుచున్నారు! దాని యోగ్యత యే మని వర్ణింతును? గుఱ్ఱమునకును దానికిని యోగ్యతలో సహస్రాంశ మంతరము. దానికిఁ గోపము, దీని కది లేదు. దానికి నవుకరు లెంతయో శుద్ధికి యత్నింపవలెను, దీని కది యక్కఱ లేదు. పరమాత్మవిధమ్మున స్వయముగనే పరిశుద్ధమైనది. దాని పోషణ కెంతో కర్చు పెట్టవలెను. ఇయ్యది తనంతఁ దానే తిరిగి

పొట్టఁబోసికొని లోకుల కెల్లను గౌరవాద్యవ్యస్తతలను గల్పించెడి చాకలివాండ్రకుఁ దోషగుచున్నయది. ఆహా! చాకలివాండ్రెంత మహానుభావులు! వీర లొసంగినబట్టలు కట్టుకొనుటచే నెంత విద్యావిహీనుఁ లైనను మహాసభలలో నఖండపాండితీమండను లగువారలకన్నను నగ్రపూజాభాజను లగుచున్నారు. ఓహో! ప్రమాద మయ్యెఁగదా! ఇందులో నత్యావేశముచే వేదాదికము నీదే యని కూడఁ జెప్పితిని గాఁబోలును? అయ్యది స్వార్థైకపరా యణులగు ఋషిహతకులు కల్పించియుందురు. కావుననే వానికిఁ గొంద ఱుత్పత్తికాలమునుగూడ నిర్ణయించియున్నారు. అయ్యవి యసత్యము లెట్లగును? అనేకు లగు స్వార్థపరులు వ్రాయుటం బట్టియే "శ్లో. శ్రుతిశ్చ భిన్నా స్మృతయశ్చ భిన్నా। మహాఋ షీణాం మతయశ్చ భిన్నాః" అని తద్బోధకమ్ములగు నాచారము లిట్లఘోషించుచున్నవి.

సంశ:—అయ్యా! తమరు పిశాచములవిషయమై చెప్పు చు మధ్య నేదో శాఖాచంక్రమణ మొనరించుచున్నారు. వారి గతి యేమిచేసితిరి?

ఉప:—ఓహో! మిత్రులారా! అప్రస్తుతప్రసంగి నగున న్ను క్షమింపుఁడు. ఇఁకఁ బ్రకృతమునకు వత్తము. వీరివిషయమై మన మంతగాఁ జేయవలసిన యుపకారము లేదు. సోమరితనము చే నొరులఁ బీడించుట మాని యాత్మవేదానుసారముగా నాగరి కత సంపాదించికొని తెలుచుగా నువన్యాసములు వినుచుండ్రు

వలెను. ముఖ్యముగా సోమరితనము మాని పాటుపడుట యావశ్యకము.

సంశ:—మీరు చెప్పినట్లు పాటుపడుటకేని వీరిలో నానాభేదము లున్నవి. అందులోఁ గొందరికిఁ దప్ప ననేకులకుఁ గరచరణాదు లుండవేమో? అందుకేని యెవరినో యావేశింపవలెను.

ఉప:— అట్లయిన వీరికి ముందు మనము విద్య నేర్పితిమేని యయ్యది వివేకము గలిగించి నానాఁటికి మహోన్నతస్థితికిఁదీసికొనివచ్చును. మీలోఁ గొందఱు తీరిక చూచుకొని రాత్రివేళనైన నొకటి రెండుగడియలు ప్రతిఫలము గోరక విద్య గఱపుటకుఁ బూనుకొనవలయును.

పిశా:—అయ్యా! మాకు రాత్రి తీరికకాదు. నే మెక్కడికేనిఁబోయి యాహారము దెచ్చికొనెడివేళయే యదికదా!

ఉప:—అట్లయిన వీరియవకాశముంబట్టియే మనము చెప్పవలెను. మీయందఱితో నంత నొక్కచెప్పాట కాదు గాని: వీరి కొక పాఠశాల స్థాపింపవలసియున్నది. ఇందులకుఁ మీకుఁ దోఁచిన సహాయము చేయక తీరదు. శాల కట్టించునీలోపున మాత్రము మన మూరకుండక "క్షణశఃకణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్" అన్నట్లు మనగృహములలోనే కూర్చుండఁ బెట్టి పాఠములు చెప్పవలెను.

పిశా:—మహారాజా! నీవు మాపాలిటికి దేవుఁడవు. అట్లనుగ్రహించవలెను.

సంశ:—తమరు మొదట సెలవిచ్చినట్లు శాలాస్థాపనమే ముఖ్యముగాని యిండ్లకు రప్పించితిమేని స్త్రీలు భయపడుట యట్లుండ "నిండుగృహముల కివేమి వాసెన్నా" లని మనలం దిట్టుదురు. పై పెచ్చు పిల్లలు జంకి జ్వరాదులపా లగుదురు. అప్పుడు లేదని చెప్పుచున్నమనమే భూలోకమున మరిడీజాడ్యముల లోవైష్ణవు లమ్మవారిం బూజించినట్లే పిశాచములకు దాసులము కావలసివచ్చును. ముఖ్యముగా నీవిషయము స్త్రీలంగీకరించరు.

ఉప—ఓహో! ఇది ప్రతిగృహస్థునకును బాధించుచున్న దే. ఈపిశాచములకన్నను మనస్త్రీలయవస్థ కడు శోచ్యముగా నున్నది. ఏక్కడనో యొక్కతె చదువుకొన్నది యున్నను నూఱుకాకులలో నొకకోవెలయై పాడగుచున్నది. ముందు స్త్రీవిద్య వ్యాపించినంగాని మనము మహోన్నతదశకు రాఁజాలము కనుక నీపిశాచములకు మీరే గతి గల్పింపుఁడు.

సంశ:—గతి కేమున్నది? శ్మశానవాటికలును, రథ్యావృక్షములును, పాడుదేవళములును, ఇంకను తత్తుల్యములగు జ్యేష్ఠాంబాకటాక్షవీక్షితములగు మఱికొన్నిచోటులును తప్ప వీరికి శాలాస్థానము గనుపట్టదు.

ఉప:—అట్లయిన మన మక్కడికే పోయి యుపదేశించుచుండవలెను. మొట్టమొదట గట్టిశ్రద్ధ వహించినంగాని మన పూనిక తుదముట్టదు. వచ్చెడియాదివార మిందుల కేదేని సదుపాయముఁగాగుఱించి యోజింతము.

సంశ:—(తనలో) ఇంతటినుండి వల్లకాళ్ళలోనికిఁ బోయి యుపన్యసించినాను కారని యుపన్యాసములలో వ్యంగ్యము గాఁ దిట్టుచుండును గాఁబోలును! ఉన్న దున్నట్లెంచక యిదియొకటి మొదలుపెట్టినాఁడు. తుద కిది "గజశ్రద్ధయి" అందుకును నిందుకును చెడి యుభయభ్రష్టతయు నుపరిసన్న్యాసమును అగునేమో కదా! కానిమ్ము చూతము. "యద్భావి తద్భవత్యేవ" మనకుఁ జింత యెందులకు? (ప్రకాశము) చిత్తము. వీరే విద్యాధరులు వీరి ననుగ్రహింపుఁడు.

ఉప:—ఓహో! మీపేరు కడు నిరర్థకముగా నున్నదే! భూలోకమున నిప్పటిసంస్కృతపండితులవలెనే మీ రిక్కడఁ గడు వ్యర్థనామధేయులుగాఁ దోఁచుచున్నారు. మీ కీవిద్యాధర నామ మెందుకు? మీ రేవిద్యయందు సమర్థులు? జ్ఞానమునకుఁ గొఱగానివిద్య యేమివిద్య? మీవలన లోకమున కేమియుపకార మున్నది? ఏవో మీకుఁ గొంచెము శృంగారశాస్త్రములు వచ్చియుండునేమో? అంతమాత్రమున మీ కీపేరు తగదు. ముందు మీ రీపేరు దీసికొనినంగాని సంఘమునఁ జేరఁ దగరు.

విద్యా:—చిత్తము.

ఉప—చిత్తమని తల యూఁచినంతమాత్రమునఁ గాదు. త్వరలో నట్టియుద్యమము నొనరింపుఁడు. మీకుఁ గొంతమంది మాయుపన్యాసములు పిచ్చిగా నుండు నని బోధింతురు. అయ్యవి విని చెడిపోకుఁడు.

సంశ:—అయ్యా! వీరే యక్షులు వీరు మహైశ్వర్య సంపన్నులు.

ఉప:—ఓహో! వీరివలననే మనలోకమునకు గొప్ప ముప్పు మూడుచున్నది ఇందులో నూటికిఁ దొంబదులు వేశ్యా కాముకులే. మనలోకములోని రంభ వీరిరాజగు కుబేరునికోడలే కదా! ఇట్టి యుంపుడుకత్తెలకు వీరి ధనములు వ్యయ మగుచున్నవి. ఆపైని పానము, జూదము వీరికి సహజములు. వీరి కామాయీ దుర్వృత్తులు నశింపవలెను.

యక్షు:—చిత్తము.

ఉప:—వట్టిచిత్తములు ఫలకారులు గావు. ధన మున్నంత కాలము మీ కీదురాచారములు మానవు. ముందు మీ ధన మంతయును భూలోకములో నిప్పుడు జరుగుచున్న స్త్రీపునఃపరి ణయములు చేసికొన్నసిరాధాములగు దంపతుల కుపచరించునట్లు ధారవోసి యాపిమ్మట నీసంఘములోఁ జేరుఁడు. లేనిచో వేళ్లు పాఱియున్న భోగేచ్ఛలు మీకు సుఖసుఖాలఁ బోనేరవు.

సంశ:—అయ్యా! వీరే కిన్నరులు. వీరివిషయమై కరు ణింపుఁడు.

ఉప:—ఓహో! వీరిపేరు కడుసార్థకముగా నున్నయది. వీరా! వీరేదో వారిలోవారు తలలూఁపుకొనుచు నొకరిచేతు లలో నొకరు తాళములు వైచుకొనుచు, పరధ్యానముగాఁ గూర్చుండుటయేకాని, యుపన్యాసమును విన్నట్టుతోఁచదు. వీరిని బాగుచేయుట కడుదుస్తరముగాఁ దోఁచుచున్నయది. అయినను

పరోపకారచింతతోఁ బాటుపడువా రూరకుండఁ గూడదు. కనుక ముందుగా వీరికి గుఱ్ఱపుమూతులు మార్పవలసియున్నది. దానికై ముందు తగినయత్న మొనరింపవలయును.

సంశ:—దీని కేమిసాధనము గావించెదరు?

ఉప:—ఓహో! అనేకసాధనము లున్నయవి. వెనుక మనము విష్ణుమూర్తికి తలకాయ యెగిరిపోయినప్పుడు గుఱ్ఱపు శిరము నతుకుటయేని యెఱుఁగుదురా? ఈశ్వరుఁడు తగుసహాయ మొనర్చి "నవ్వీనయూళ్ళే పట్టణము"లై నట్లు మన కోరికల సిద్ధింపఁజేసి జగదుపకార మొనరింప నెంచెడుఁగాక!

సంశ:—అయ్యా! యింకను ఈ దేవయోనివిశేషులలోఁ గొందఱు మిగిలియున్నారు. వీరిగతి యోజింపుఁడు.

ఉప:—ఓహో! ఇట్లు ప్రత్యేకముగా బోధించుట కడు దుస్తరము. కనుక నిఁక నెల్లరకును ననుకూలించు తెఱఁగున పనున్యసించెదను. అందుఁ జిరపరిచితపూర్వాచారపరాయణతా దోషవశమ్మున దొరలుచుండెడి విరుద్ధమ్ములువదలి యాత్మవేదానుసారమ్ముగాఁ జెప్పఁబడ్డతులే గ్రహింపుఁడు. అందులో శబ్దదోషములు బొత్తిగాఁ బాటింపకుఁడు. సారాంశములు మాత్రము గ్రహింపుఁడు. మనము నానాకారణములవలన నీశ్వరు డున్నాఁడనియును, పరలోకమున్నదనియును, పాపశిక్షణ పుణ్యాభక్షణము లున్నవనియును పూర్వులపలెనే యొప్పుకొందము. జన్మాంతర విగ్రహారాధనాదిసంగతులు త్యజింపవలయును. వానియందలి దోషములంగూర్చి కొన్ని పెద్దపెద్దపుస్తకములు భూలోకములో

బయలువెడలియే యున్నవి. ఇఁక మన మెంతసేపు చర్చించినను జాతిమతద్వేషములను గుఱించిముఖ్యముగాముచ్చటింపవలెను. జాతివిషయమునఁ బశుపక్ష్యాదులకు గూడ మనలోఁ గలుపు కొనుటకు యత్నింపవలసినదే కాని యింకను అంతనాగరికత మనకు రాలేదు. కనుక నిప్పటి కంతవఱకును పోక తగుమాత్రము నీ సంస్కరణమునకు విషయముగాఁ జేసికొందము. అట్లని యీ విషయమైబొత్తిగాఁ జర్చింపఁదగ దని నాయభిప్రాయము కాదు. కొంచెము మధ్యమధ్య నావిషయముకూడ నలుగుచుండఁదగినదే. మరణములు మనలో లేవు కనుక విధవావివాహములును, వృద్ధత్వాదికము లేకపోవుటచే నతిబాల్యవివాహములును మనకంత చర్చింపవలసిన విషయములు కావని మీలోఁ గొందఱు శంకింపవచ్చును. వాదసౌకర్యార్థము క్షణకాలము మీవాదము నొప్పుకొన్నను యంత యుక్తిసహము కాదు. మన మేయే దుఃఖము లిచ్చోట లేవని యుప్పొంగుచున్నామో వానిలోఁ గొన్నిటిని భూలోకములో బుద్ధిమదగ్రేసరులు వారియాత్మవేద సాహాయ్యమునఁ గనిపెట్టియున్నారు. దానిలో నొకటి యుదాహరించుచున్నాను. కాని యియ్యది మిక్కిలి జుగుప్సాకర మగుటచే నంత సభ్యమైనసంగతి కాదు. కాకున్నను వైద్యులకు గోప్యము లేనివవువున దురాచారరోగపీడితులగు జనుల నుద్ధరించువారలకుఁగూడ వచింపరానివిషయ ముండఁగూడదు కదా! మిత్రులారా! మనయువజ్ఞతలు మన మించుకయు నెఱుంగక విఱ్ఱవీఁగుచుఁ జావులేదనియు ముదిమి లేదనియుఁ గేవలశబ్దశాస్త్ర

వేత్తలగువారు ముఖస్తుతికై ప్రయోగించెడియమర్త్య త్రిదశ నిర్జరాది శబ్దములు ఘృతకోశము (నేతిబీఱకాయ)లని తెలియక యొడ లెఱుంగనివిధమున నుప్పొంగుచున్నారము. ఇయ్యది నిక్కమే యైనచో నిందులోఁ గొన్నిటికిఁగాని లేక ప్రధానమగు మృత్యుబాధకే కాని హేతువని చెప్పఁదగు సుఖవ్యాధి మనస్వ ర్గమున నేల యుండవలెను? అది యెవరికో కాదు. కొన్ని సంవ త్సరములక్రిందట నొకసోమయాజులకుఁ దటస్థించినదఁట! దాని కీరంభాసంభోగమేకదా! కారణము. ఈసంగతి భూలోకములో ని కొన్నిపుస్తకములవలన వెల్లడి యగుచున్నది. ఇప్పుడేని మీ సంశయము నివర్తించినదా? ఇట్టిఘోరకృత్యములు మనము కని పెట్టక యడఁచివేయుట తగునా? తోడిభూలోకమునేనిఁ జూచి తెలివి తెచ్చుకొనవలదే! మనంతటఁ గనిపెట్టనేరకున్నను కని పెట్టి చెప్పినప్పుడేని దురాచారములను దిద్దుకొనుటయనర్హమా? కావున మనకు జననమరణాదికము మనుష్యులతోపాటుగను, ఆ హారాద్యాసక్తి పశువులతోపాటుగను నుండుట నిస్సంశయమే కదా! కనుక మన కిఁక వృథాజాతిమతాది వైషమ్యములతో నేమియవసరము? ఇది పరిత్యజించినన్‌గాని మనకు మహోన్నత స్థితి గలుగనేరదు. ఇఁక నొకటి, వివాహములలో వావివరుసలు గూడ మొట్టమొదట భగవత్సృష్టిలో నున్నట్లు ప్రమాణ మేది యును లేదు. ఇదియును, పిదప నాయాబుషిహితకులే కల్పించి నారనుట నిశ్చయమే. ఎవరో యెందులకు? మనతాతగారేయీ విషయమును కూఁతురైన సరస్వతిం బెండ్లియాడి సూచించియు

న్నారు. లోకానుగ్రహార్థము కాక అయ్యనఘాత్ముఁ డిది యకా ర్యకరణమే యైనచో నెందుల కాచరించెడిని? ఐనను; ఇప్పు డ య్యది యాచారములో లేదని కొందఱుశిష్టాచారపరాయణులు వాదింపవచ్చును. అదియును సూక్ష్మబుద్ధులకుఁ బొడకట్టు చునేయున్నది. ఆయజునికుటుంబములోనివే అయి యిప్పటికిని అదేపేరున వాడఁబడెడిమేఁకలలో నీయాచారము పూర్తిగాఁగాన వచ్చుచున్నయది. ఆలోచింపఁగా బ్రహ్మసమ్మతించిన యీయా చారమును, ఇటీవల స్వార్థపరులేకారణముచేతనో యడఁచి వేసియుందురు. లేకున్న రజకాదినీచవర్ణములలో స్త్రీపునర్వివా హాశేషమువలెనే యీసంగతి మేఁకలలో నెందులకు నిలిచి యుండవలెను? అంతకన్న దీనికి బల మెక్కువగాఁ గూడ నున్న దనుటకు సందియము లేదు. బ్రహ్మకును మేఁకలకును నెక్కుడు సంబంధ మేకశబ్దముచే వాడఁబడుటకూడ మనము చూచుకో వలెను. ఇదిగాక ; రజకాదులవలె నియ్యవి పూర్వాచారపరా యణులమతమునఁగూడ నపవిత్రములు కావు. యజ్ఞములలో దీనికన్నఁ బవిత్రమైనజంతువు లేదని యంగీకరించియున్నారు. ఇంతకన్న మీకుఁ బ్రబల దృష్టాంత మేమికావలయును? ఇక్క డికి జాతిమతాదిభేదముతో పాటు వావివరుసలుగూడ ననవసర ములని తేలినదికదా! ఇఁక ద్రౌపదిచరిత్రముంబట్టి చూడ నొక స్త్రీకి విధివిహితముగా నైదుగురే కాక, యుద్యోగాదిపర్వ ములలోనికొన్ని సంగతులంబట్టి చూడఁగా నాలుగురుభర్తలు కూడ నుండవచ్చు నని పొడకట్టుచున్నది. "శ్లో. పంచ మే పతి

యస్సంతి మహ్యాం షష్ఠోఽపి రోచతే *" అను ద్రౌపదీవాక్యముచే స్త్రీ లందుల కంగీకరించుటకూడ సూచించుచున్నది. ఇట్టిసదాచారము నేకారణముననో స్వార్థపరులు రూపుమాపి యుందురు. సత్యవతీవిషయమును, కుంతీచారిత్రమును పరికించి నచో నొకకొమరునిం గనుటకును కన్యాత్వమునకు భంగము లేదని తేలుచున్నది. ఊరక వ్యభిచరించుట తప్పుగాని తక్కినది దోషము కాదని మనస్సాక్షికి వచ్చుచున్నది. అందులకుం బూర్వగ్రంథములును మహాపతివ్రతలును నంగీకరించుచున్నారు. ఆ యాసంతానముల భాగముల విషయమై ధర్మశాస్త్రములు గూడ నుండుటచే బెద్దలసమ్మతికూడ నిర్వివాదమే. ఇంత యేలా? పర్యాయముగా ననేకభర్తలను వరించుటకుం ద్రిలోక పావని యని పూర్వు లొప్పినగంగయే ఘోషించుచున్నది. ఆపెకు శివుడు, సముద్రుండు, శంతనుండు ఇందఱు భర్తలుకదా! ఓహో! ఈశ్వరా! పొరపాటున పూర్వాచారపరాయణు లొనరించిన కట్టుకథలు నీయెదుట నేకరువుపెట్టుచున్నాను. ఇదిగాక యాత్మ వేద్యైకశరణునకు నాకీగాథలవలన నేమిప్రయోజనము? ఏది యెట్లైనను స్త్రీలును పురుషులును యథేచ్ఛముగా వివాహము చేసికొనుట కభ్యంతరము లేదని యుక్తికి వచ్చుచున్నది. ఇది యిట్లుండ సర్వలోకములలోను సుమారు ముప్పదివత్సరముల క్రిందటి లెక్కంబట్టి చూడంగా స్త్రీలసంఖ్యకన్నం బురుషుల

---

* నాకైదుగురు భర్తలు కలరు. ఇంకను ఆఱవభర్తగూడ నుండినచో బాగుగా నుండు నని తోంచుచున్నది.

సంఖ్య యెక్కుడుగాఁ గనుపట్టుచున్నది. దానింబట్టి పురుషు లనేకులు వివాహములు కాక చిక్కుపడుచుందురు. అందులకై కొన్ని లోకములలో విశ్వస్త్రావివాహము లేర్పఱచుచున్నారు కదా! అట్లుండఁగను అనఁగా మిక్కిలి వృద్ధులగు పురుషులు మిక్కిలి వృద్ధలగు నంగనలన్ గట్టికొన్నను మఱికొందఱు పురుషులు మిగులక మానరు. "అంత వృద్ధులకు వివాహ మెందుల" కని మీరు శంకింప నవకాశము గలుగవచ్చును. వివాహము కేవల భోగప్రధానమే కాదు గనుక మీ రంత శ్రమపడి శంకింప ననసరములేదు. కనుక నెల్లరకును వివాహము ముఖ్యమని తేలినది. ఇఁక మిగిలినపురుషులగతి చూడవలసియున్నది. ఆయుపాయము బాలురకుఁగూడ సుగమమే. అయినను; కొంత వివరించుచున్నాను. పశుజాతిలో నొక తెగ యగు నేనుఁగులలో విచారించినచో ననేకలక్షలకరిణుల కొకటే కరి నాథుఁడుగా నున్నట్లు భాగవతము విస్పష్టముగా నుడువుచున్నది, కాని; అట్టి పురాణవాక్యములు నమ్మఁతగినేని "ముప్పు మూఁడు తెన్నులును; అప్పు ఆఱు తెన్నులును" అగును, కావున మన మవి విశ్వసింప వలనుపడదు. కావున నిక ననుభవముంబట్టి చూతము. తక్కిన జాతులలో నెట్లున్నను; ఆవులలో మాత్రము విశేష సంఖ్యగల మందల కొకటే యాఁబోతు భర్తగా నుండుట భూలోకమునఁ బ్రతిగ్రామమునను సామాన్యముగాఁ జూడఁబడును. మొత్తముమీఁద నాజాతిలో వృషభములును, ఆలును నించుమించుగా సరిగానే వృద్ధిచెందుచున్నను; ఎద్దులను కార

సాంతరముచే పాలికులు స్వార్థపరత్వముచేఁ బుంస్త్వశూన్య
ములుగా నొనర్చుచున్నారు. ఆహా! ఈజనులమూర్ఖత కేమన
వచ్చును? ఇయ్యది నిర్బంధవైధవ్యముకంటె నూఱురెట్లు నన్ను
తలపాటు చెందించుచున్నది. కానిండు; చిరకాలప్రాప్తమైన
యీదురాచారము లింతలో నడుగంటవు. సమాజములు ప్రబ
లినకొలఁదిని పశుజాతిలోఁగూడఁ గొన్ని యిందులకుఁ బూను
కొని కొంత పని చేసినచో నడుగంటవచ్చును. "పశువులకు మన
వలె వివేక మెన్నటికిని కలుగదు. వానికి సమజములే కాని
సమాజము లెట్లు తటస్థించును?" అని మీరు శంకింపవచ్చును.
భారతములో మృగము లన్నియుం గలసి ధర్మరాజాదులకోఁ
దమ దురవస్థ నేదోవిధమున విన్నవించుకొన్న ట్లున్నది. చూ
చుఁడు. పశుప్రాయులకు విద్యవలనఁ దెలివి గలిగినప్పుడు పశువు
లకుమాత్రము గలుగ దని మన మెట్లూహింపఁగలము? అది
గాక గోశబ్దమునకు గోవును, వాక్కును గూడ నర్థము. దానిం
బట్టి చూచిన నుభయములకును కడు దగ్గఱ కనుక పశ్వాదులకు
విద్యవచ్చుట సుకరమే. ఇంకను పశువులు మనుష్యులవలె సంచ
రించుట భూలోకమునఁ గొన్నివినోదములలో ననఁగా "సర్కస్
కంపెనీ"లలోఁ జూడవచ్చును. ఇఁక, ప్రకృతమునకువత్తము. గో
జాతిలో స్త్రీజాతి మనలో నొకపురుషుఁ డనేక స్త్రీలను వివా
హమాడినట్లే లెక్కకురాని యావు లొకటే యాఁబోతును
వరించుచున్నవి. లేదా! యీయాచారము మళయాళపు స్త్రీ
లోకభోగపురుషుని నెందఱెందఱో వరించినట్లైనను నుండవచ్చును.

జీవమంతయునొకటేకనుక నాజంతువులదుస్థితిఁగూడ మాన్పఁ బ్రయత్నింపవలసినదే. కొంద"ఱిది సహజము గనుక మనమాన్పనకు నలవడ" దని వాదింపవత్తురు. వారి నట్లే సంతోషింపనిచ్చి చేతనైనంతవఱకు మనము యత్నమునే చేయుచుందుము. శ్లో. యత్నేకృతే యది న సిధ్యతి కోఽత్ర దోషః.* " కనుక నెందులకేని యత్న మావశ్యకము. ఇప్పుడే మనలోకముకన్న నాగరికత భూలోకమున నెక్కుడుగా నున్నదని చెప్పియే యున్నాను. ఇప్పుడు నేను చెప్పినవిషయ మాలోకమునకే యెక్కుడుపకారకమైనది. వా రిద్దాసిన్ గుఱించి యింతవఱకుఁ గనిపెట్టినట్లు తోఁచదు. కావున మన కీస్వర్గలోకసంస్కరణభారము కొంతయైనఁ దగ్గినపిదప నే కామరూపమునో ధరించి మనుష్యులలోఁ జేరి వారి కీ యుపాయము చెప్పెదను. ఓహో! ఎంత పొరఁబడితిని! ఈకామరూపములవలన ననేకదోషములు గలుగుచున్నవని బుద్ధిమదగ్రేసరులగు సంస్కర్తలు నిర్వచించియున్నారు. కనుక నింతకుఁబూర్వ మేమైనను; ఇఁకముందు మన మీ విషయమును మానుకొనక తప్పదు. "శ్లో. స్వయం తరితు మక్షమః కథ మసౌ పరాం స్తారయేత్*" అన్నట్లు మన సంస్కార మిట్లుండ వారిసంస్కరణమునకుఁగూడ మనము తోడ్పడుట వెఱ్ఱిగా దోఁచుచున్నది. కానిండు; "శ్లో. ఉత్పద్యంతే ప్రలీ

* ప్రయత్నించినపైని సిద్ధింపనిచో తప్పేమి?

* తాను తరించలేనివాఁడొరుల నెట్లు తరింపఁజేయఁగలఁడు ?

యంతే దరిద్రాణాం మనోరథాః*" మాటల కే మభ్యంతరము? కొని తేవలయునా? ఇఁక నసుపయుక్తాంశమైనను శేషము పూరించుచున్నాను. ఆమిగిలినపురుషులకును, ఈయావులకును సంబంధబాంధవ్యములు కలిపినచోఁ బురుషు లందఱును గృహస్థులుగా నుండవచ్చును. "గోబ్రాహ్మణేభ్యః" అని యుండుటవలన నందులో గోవులకును బ్రాహ్మణులకును మఱియుం జక్కఁగ గలియును. ఈవిజాతివివాహమునకై మీకుఁ గొన్ని నిదర్శనములిచ్చుచున్నాను. రావిచెట్లకును వేపచెట్లకును పూర్వాచారపరాయణులు వివాహము లొనర్చుచున్నారుకదా! ఇఁక నెల్లరును మఱియొకజాతిచెట్టుతో వేరొకజాతికొమ్మను చేర్చి యంటుకట్టుచున్నారు. కొమ్మనుబట్టియే కాయలు దిగుచున్నవి. ఇయ్యెడఁగూడ కొమ్మనుబట్టి దూడలే పుట్టును గాని మనుష్యాదులుమాత్రము పుట్టరు. సాధారణముగా సంతతి క్షేత్రము ననుసరించుట యనాదిగాఁ బ్రసిద్ధము. "ఏది యెట్లైనను భిన్న జాతులకుఁ బొసఁగ" దని మీరనవత్తురేమో? అట్లయిన సంస్కరణమే కుదురదు. బ్రాహ్మణత్వ శూద్రత్వ చండాలత్వాదులు భిన్నజాతులు కావా? వారల కిప్పుడో యిఁకనో భూలోకమున నన్యోన్య వివాహములు కానున్నవి. ఇఁక ముందుమాటటుంచుఁడు. పూర్వము కాలేదా? పరాశరులు పుట్టలేదా? పశుపక్ష్యాదులకును మానవులకునుగూడ నిర్వివాదాంశమే యనుటకుదాహరణము లెన్ని లేవు? ఇదివరలో నిచ్చిన మహిషాసురుఁ

---

* దరిద్రులకు మనోరథము (కోరిక) లు (సముద్రతరంగములవలెనే) పుట్టుచుఁ బోవుచు నుండును. అనఁగా నొక్కటియుఁదుదముట్టదని భావము.

కొల్లుండ శుకుఁడు చిలుక కతనఁ బుట్టినవాఁడు. ఇతఁడు సాక్షాచ్ఛుకమునకుఁ బుట్టలేదందు రేమో? అశ్వినీసుతులు మొదలగు వారల నిందుల కనేకులను లక్ష్యము చూపించవచ్చును. అవాంతరజాతిభేదము లిటీవలనే కల్పితము లైనవనియును వానినే మన మిప్పుడు సంస్కరింపవలసియున్న దనియును చెప్పియే యున్నాను. ఇట్టిప్రత్యక్షప్రమాణములచే శబ్దప్రమాణములు కొట్టఁబడవా? కనుకఁ బశుపక్ష్యాదిజాతిభేదములుగూడ నానాఁటికిఁ బాటింపక సంబంధబాంధవ్యములు చేసికొందు రేని విశేషైకమత్యముగల్గి యేలోకమేనియు మహోన్నత్యమును బొందు నని మాయభిప్రాయము. ఇట్టిసుగమములగు మార్గము లన్నియు శాస్త్రకర్తల మని పేరుపెట్టుకొన్న స్వార్థపరులు నానాఁటికిఁ జెడఁగొట్టియుందురు. ఈవిషయమును కొంత యప్రస్తుతమే యయినను బొత్తిగా ననవసర మని మీరు నిరసింప రని యెంచి కొండొక నాకుఁ దెలిసినంతలో వివరించుచున్నాను. ఇందులకు మొట్టమొదటివి వేదములు. అవి నాలుగు. ఋగ్యజుస్సామాథర్వణము లని వానికి నామములు. కొందఱు మూఁడని యందురుగాని; అది పూర్వాచారపరాయణులు త్రయీశబ్దమును సాధించుటకు బొంకుకుయుక్తి. ఆనాలిగింటికిని ఆగమము లని పేరొకటి యున్నది. దీనింబట్టి చూడుఁడు. ఆగమ మనఁగా వృక్షము. అవి చదువుకొన్నవాఁడు చెట్టువలె జడుఁ డగు నని తెలుచున్నది. ఇఁకను తదంగములు——

"శ్లో. శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా,
కల్పశ్చేతి షడంగాని వేదస్యాహు ర్మనీషిణః*"

ఈయాఱంగములలోనను మొదటిది శిక్ష కదా! ఇది చదువుకొన్నవానికిఁ బరలోకమునఁ బరమాత్ముఁడు శిక్ష విధించు నని తెలుపుచున్నది. ఇఁక వ్యాకరణము. దీనిఁగని బొత్తిగా నఫలోపముగా నున్నది. దీనిం జదువుకొన్నవారు రెండుమాటలను కొంచగారవమును లోకోపకార మయ్యెడి స్వవిషయములో సరిగా నహాస్యపు టుత్తరములుగూడ వ్రాసికొననేరక యొకరిచే వ్రాయించికొనుటయే కాక దానిపై వ్రాలుసయితము చేయనేరక తుదకు 'సశాసీ' పెట్టింతురని యనేకులు వ్రాసియున్నారు. కనుక నేను తిరిగియు వక్కాణింపవలసినది లేదు. దీనికనేకులు పూర్వులు కర్తలుగా నున్నను విపులముగా నేకత్ర సర్వమును జేర్చి రచించినవాఁడు పాణిని. దానిపై లెక్కకు మిక్కిలి వ్యాఖ్యానము లున్నవి. ఈపాణినింగూర్చి క్రొత్తగా నేను సంఘటించితి నను కొనకుండుటకై పూర్వులు రచించినవే రెండుశ్లోకము లుదాహరించుచున్నాఁడను—

శ్లో. కాచం మణిం కాంచన మేకసూత్రే
గ్రథ్నంతి నార్యాః కథ మత్ర చిత్రమ్,

---

* శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, అని విద్వాంసులు వేదమున కాఱంగములు చెప్పుదురు.

అశేషవిత్పాణిని రేకసూత్రే
శ్వానం యువానం మఘవాన మూచే.*" ౧

"శ్లో. నపుంసక మితి జ్ఞాత్వా ప్రియాయై ప్రేషితం మనః,
తత్తు తత్రైవ రమతే హతాః పాణినినా వయమ్.♦"

ఈరెండుశ్లోకములంబట్టి యితని కాపితి తెలియదనియు సమయస్ఫూర్తి గాడనియును పైపెచ్చు మోసపువృత్తి యని యును విస్పష్ట మగుచున్నది. ఇతనివేసు సాక్ష్యమునకే మొన్నె సూత్రములు కావలయును. దానింబట్టిం చేసిన మధిక మా కూడ నొప్పుకొని తీరవలెను. భూలోకమునఁ బూర్వాచారపరా యణులు తప్ప సులభమైన జగదుపకారమొనరించు కవిశేఖరు లెవ్వరును నితని శాస్త్ర మంగీకరింపరు. మొదటను కన్నకే యిన్నియాక్షేపణ లున్నవు డితనిశాస్త్రము నభ్యసించినవారు లోకమున కేమిపనికివత్తురు? కేవలమూర్ఖులవలన నుపయోగ మంత లేకున్నను; అపకారముగూడ విశేషించి యుండదు. ఇట్టి వారో! లేనిపోనిసంగతులు బోధించి జగము పాడుచేసి యెన్ను

---

* స్త్రీలు పూసలను, మణులను, బంగారును, ఒకేసూత్రి (దార) మందు కూర్చుచుందురు. ఇదియొక చిత్రమైన సంగతిగాదు. సర్వమును దెలిసిన పాణి నియే ఒకసూత్రమునందు కుక్కను, పడుచువానిని, ఇంద్రుని కూర్చియున్నాఁడు. "సూ-శ్వ యువ మఘోనా మతద్ధితే" అని పాణి న్యాచార్యులవారు చెప్పిన వ్యాక రణ సూత్రము.

♦ మనశ్శబ్దము నపుంసక మని తెలిసికొని నేను నాప్రియురాలియొద్దకుఁ బంపితిమి. అదియో ఆప్రియురాలియొద్దనే రమించుచుండెను. అక్కటా! మేము పాణినిచే వంచింపఁబడితిమి!

టికిని మహోన్నతదశ నందనీయరు. ఇంతటితో మీకు వ్యాక
రణమువలని యుపయోగము తెలిసియుండవచ్చును. ఇదిగాక
"వ్యాకరణ" అనుపదములో " రణ " అని యున్నది. దానికి
యుద్ధ మర్థము. అనఁగా వీరు పోట్లాడుటకుఁ దప్ప నెందులకును
పనికిరా రని తేలుచున్నది. ఇఁక మూఁడవది ఛందస్సు. దీని
యనుపయుక్తి మీకుఁ ద్వరలోనే బోధపడవచ్చును. ఛాందసు
లనుపేరు మీ రెఱుంగనియది కాదు. దాని కున్న గౌరవము
నేను వర్ణింపనక్కఱలేదు కదా! ఇది చదువుకొన్న వారికే
యీ బిరుదము కలిగెడిని. కొందఱు "ఆఛందశ్శబ్దమునకు వేద
మర్థ" మని వాదింపవత్తురేమో ? అది మాకు మఱియును
సమ్మతము. అంగిగతియే యట్లున్నచో నిఁక నంగముగతి
యనుకూల మెట్లగును? ఇఁక నిరుక్తము. ఇది తనపేరుచేతనే
విశ్వాస్యముగాఁ దోఁచదు. చెప్పఁబడని దని కదా! యర్థము.
చెప్పఁబడనిశబ్ద మప్రసిద్ధము. దీనిం జదువువారు పాడగుట కేమి
సందియము? "నిరుక్తశబ్దమునకు నిర్వచనము చేయఁబడిన"దని
యర్థము చెప్పుదురేమో? అది మే మొప్పుకొనము, ఇఁకజ్యోతి
షము. ఇది మఱియును విశ్వసింపఁదగినదికాదు. పరమువంచకుఁ
డగుమనబృహస్పతిగూడ నిందులోనొక గ్రహము. ఇతనిశిష్యుఁ
డును పడ్డకుఁడుమనగు చంద్రుఁ డొక గ్రహమఁట! వీరిరువుర
కును గొమరుఁడగు బుధుఁ డొక గ్రహము. పైనుదాహరించిన
బృహస్పతికి శత్రువగు రాక్షసగురువు శుక్రుఁ డొక గ్రహము.
కుజుఁ డొకగ్రహము. సూర్యుఁ డొకగ్రహము. ఇతనిపుత్త్రుఁడు

శని యొకగ్రహము. మఱియును రాహుకేతువులుగూడ గ్రహము లనియే మనవారు చెప్పుచున్నారు. వీనిలో కొందఱు కొందరికి మిత్రులును, మఱికొందఱు మఱికొందఱికి శత్రువులును, మఱికొందఱు మఱికొందరికి సములు నని చెప్పియున్నారు. ఈ సంగతివలననే యీశాస్త్రము నిష్ప్రయోజన మని మీరు తెలిసికోనచ్చును. బృహస్పతికిని జంద్రునకును వైరము మన మెఱిగినదేకదా! అట్టి వీరిరువురకును నీశాస్త్రములో మైత్రి నిర్ణయించియున్నారు. ఇట్టివిరుద్ధము లనేకములున్నవి. వాని నన్నింటిని దెలుప నుంకించితినేని యెంతకాలమునకేని తెవ లదు. ఇంతవఱకైనను నేను వేదాదికము నూరక దూషించుట లేదనియు, దానిసార మంతయు గ్రహించినవాఁడనే యనియు మీమదికి నచ్చుట కుపన్యసించితిని. ఇఁక కల్పము. ఇది లోక ములో వాడఁబడుకల్పములవంటిదే. కొంద ఱిది యట్టిది కాదని వాదింతురేమో? పోనిండు "కల్ప" అని తెనుఁగుదేశములో వంటచెఱుకు మొదలైనకట్టెలకు వాడుదురు. అనఁగా శుద్ధశుష్క మయిన దని తేలుచున్నది. ఆపేరు దీనికి దానింబట్టియే వచ్చిన దని తోఁచుచున్నది. ద్రౌపదిచరిత్రముంబట్టి కాఁబోలును? ఆదేశములో నా అక్షరములకు మించని తెలుఁగుపదమును సంస్కృతపదముతో సమాసము చేయుచున్నారు. ఇట్టి వనేక ములు చూపవచ్చును. అట్టిసంబంధములు భాషలకుఁబరస్పరము నానాకారణములంబట్టి యుండవచ్చును. ఇట్టివి సూక్ష్మబుద్ధులు

గాని గుఱితింపఁజాలరు. అందుల కాత్మవేదము ముఖ్యము,
ఇఁక షడ్దర్శనములఁ గూర్చి యించుక చర్చింతము.—

"శ్లో. పాణినే ర్జైమినేశ్చైవ వ్యాసస్య కపిలస్య చ,
కణాదస్యాక్షపాదస్య దర్శనాని షడేవ హి.* "

ఇందులో మొదటిదగు వ్యాకరణ మంగములలో విచా
రింపఁబడినదే కదా! జైమిని చెప్పినది పూర్వమీమాంస.
ఇదియే మనకు నుడికియు నుడుకని యుచ్ఛిష్టపుమెతుకు లాహార
ముగా గల్పించిన పిచ్చిశాస్త్రము. ఇఁక దీనియనుపయుక్తత
మీరే తెలుసుకొనఁగలరు. కపిలుఁడు చెప్పినది సాంఖ్యము. దీని
పేరుంబట్టి చూతము. ఇది చదువుకొన్నవారలకు లెక్కలలో
జ్ఞాన మట్లుండ సంకలనము చేయుశక్తియైనను గలుగదు.
కొందఱుసాంఖ్య మను పేరునకు మఱియొకయర్థము చెప్పి సాధిం
పవత్తురేమో? అట్టికుకల్పనలకు మనపండితులు పుట్టినయిండ్లే
కనుక మేమవి విశ్వసించి పొడగుట్టు కొప్పుకొనము. ఇంతకుఁ
బూర్వమే వ్యాసులు రచించిన యుత్తరమీమాంసమునుగూర్చి
చెప్పవలసి యున్నది గాని; అంతకన్న నీసాంఖ్యసిద్ధాంతమే
నామదికి నచ్చినదని తెల్పుటకుముందు దీనినే యెత్తుకొన్నాఁ
డను. ఈసాంఖ్యకర్తయగు కపిలమహామునివలెనే యీవ్యా

* పాణిన్యాచార్యులవారు చేసిన వ్యాకరణము, జైమిన్యాచార్యులవారు చేసిన పూర్వమీమాంస, వ్యాసభగవానులవారు రచించిన ఉత్తరమీమాంస, కణాదమహాముని యొనర్చిన వైశేషికము, గౌతముఁడుచేసిన న్యాయశాస్త్రము, కపిలుడు చేసిన సాంఖ్యశాస్త్రము అను ఆఱింటికిని దర్శనము లనిపేరు.

సులనుగూడ నారాయణావతార మని చెప్పుదురు. అది యంత విశ్వసనీయముకాదు. అందువలను భూలోకములో నెవ్వఁడు బుద్ధిమదగ్రేసరు లెవ్వరును నంగీకరించుటలేదు. దానికిఁ గారణము లేకపోలేదు. ఆ యొప్పునివారిలోఁ గొందఱు వ్యాసులు రచించిన గ్రంథములకన్న నెక్కుడు సులభశైలని నంతకన్న ననేకగ్రంథములు రచింపఁగలిగినవారే కాని సామాన్యులు గారు. వారికి "వ్యాసులే నారాయణుఁడైనచో "కోహం రండే!" అన్నట్లు మన మెవరమై యుందుమో?" అను సంశయము కలిగి యది తీరక తుదకు సర్వమును గోంటకూరకట్ట క్రిందఁ గట్టి రని మన మూహింపవలసియున్నది. అదియును నాకు యుక్తియుక్తముగానే కనుపట్టినది. ఈయనమతమువలననే అద్వైతులు "అహం బ్రహ్మ"లై "యంబ్రహ్మల"కన్నను పాడగుచున్నారు. ఈయనవ్రాసినవే అష్టాదశపురాణములు. కాని యిన్నిటికిని కర్త యొకఁడా? అనేకులా? అనికూడ ననేకులు సంశయించుచున్నారు. మఱియు భారతముకూడ నీయనరచించినదే. ఇఁక మఱికొంద ఉపపురాణములు పదునెనిమిదియు ననేకస్మృతులును వ్రాసియున్నారు. వాని నన్నిటిని దోషములు చూపించి నిందించుటకన్న మీరు పఠింపవల దని చెప్పుట సుళువు వని మా యభిప్రాయము, ఇఁక రామాయణ మని యొకటి యున్నది. అది యాదికావ్య మని మనవారియభిప్రాయము. అదియును నానారసములతోఁ బూరింపఁబడి యున్నను; అక్కడక్కడ నిప్పటియినమతమున బొత్తిగా హేయ మనియు లోకాపకారక మనియుఁ జెప్పఁదగినశ్లోకంగాని

రసమును బ్రకటించుచున్నది. దీనింబట్టియే కాఁబోలు! సంస్కృతకవులేమి, భాషాకవులేమి తమగ్రంథము లెల్ల శృంగారరసమయములుగాఁ జేసియున్నారు. కాని; ప్రపంచము చేసికొన్న యదృష్టము నేఁటికిఁ బండి అట్టిదుష్కావ్యములవలనఁ బ్రయోజనము లేదని కనిపెట్టి మంచిగ్రంథములను సులభశైలిలో వ్రాయఁదగుమహానుభావు లవతరించి పరమోపకారము చేయుచున్నారు. కావ్యలక్షణ మని చెప్పినవారుగూడ "సాలంకారౌ" అని దానిలోఁ జేర్చినారు కాని; మే మది యంగీకరింపము. మా మతమునఁ గావ్య మెట్లుండవలయు ననఁగా పూర్వాచారపరాయణయగు శుద్ధవైదికవితంతువుం బురణించుచుండవలెను. అట్లని పూర్వాచారము లన్నియుఁను దానినిండఁ గుచ్చి యెత్తవలయు నని మా యభిప్రాయము కాదు. శృంగారమును, అలంకారములును దానిలో నుండఁగూడదు. శృంగారకావ్యములు చదివినవిద్యార్థులు పాడు గాక మానరు. కనుక మే మిట్లు లక్షణపరిష్కార మొనరించితిమి. పూర్వులు వ్యభిచారభయమున వితంతువులను విరూపిణులఁ జేసినట్లే మేమును కావ్యముల నిట్లు మార్పఁదలంచితిమి. దీనింబట్టి "కావ్యములయందే శృంగారరసము తగ్గింపవలయునా? దాని కాలంబనములగు స్త్రీలయందుఁగూడ నది యట్లు కాఁదగినదే యగునా?" అని కొందఱు శంకింపవచ్చును. క్రమముగా నదియును గాఁదగినదే అని మా యభిప్రాయము. "అట్లయినచో వేషభాషాభూషిత లయిన యోషామణులు మనస్సునకు నకారణముగ వికారమ్ము మాపాదిం

చెదరు గాన వారలందఱును సాధ్యమైనంతత్వరలో నలంకార
ములమాటట్లుండ నెక్కుడు వైరూప్యమాపాదించెడి శిరోముం
డనముసయితమొనర్చుకొనవలయుననియేనా మీయభిప్రాయ”
మని మమ్ముఁ గొందఱడుగవచ్చును. మీకిది విరుద్ధముగాఁ
దోఁచినను నిప్పట్లు మాకది సమ్మతమే యని యొప్పుకొను
చున్నారము. “శ్లో. ఆత్మబుద్ధి స్సుఖంచైవ” అనుటవలన మా
యాత్మకన్న నితరులయాత్మ మాకంత ప్రమాణము కాదు
కదా! ఇకఁ బ్రకృతమునకు వత్తము. ఇంతకుఁ దేలిన సారాం
శము. చదువుకొనువారల కుపయుక్తములైన గ్రంథములు
పునస్సృష్టి కావలసినవే కాని మున్నున్నవి పనికిరావని తేలినది.

ఇఁక నక్షపాదుఁ డనఁగా గౌతముఁడు. ఈయనరచించి
నది తర్కము. మొదల నీయన కందఱవలెఁ గాక పాదమందు
నేత్ర మున్న దనుటవలననే యిమ్మహానుభావుఁ డొనరించిన
శాస్త్రమును నిట్టిదిగనే యుండు నని మీరు సులభముగాఁ
దెలిసికొనవచ్చును. ఈవిద్య లోకోపకారకము కాదు సరికదా,
పైపెచ్చు దీనిం జదివినవారు గాడిదపుట్టుక పుట్టుదురని కూడ
శాపమున్నదఁట! ఇది యెంతవఱకు సత్యమైనను పునర్జన్మము
నొప్పనిమనము గాడిదవలె మూర్ఖులగుదురని యైనను గ్రహింప
వచ్చును. ఈ విషయమునే కణాదుఁడుకూడఁ జెప్పియుండవ
చ్చును; గనుక దీనికోపాటే అయ్యదియు నని యెంచి యిఁక
నీ విషయము గట్టిపెట్టి మఱియొక యంశమునకు వత్తము.
మొత్త మివి యన్నియును నానాఁటికిఁ గట్టఁబాట్లను వృద్ధిచేసి

మనకొంప తీయుచున్నవి. వేయేల ? సంగీతమున కన్నికట్టుఁ బాటులేల యుండవలెను? "పల్లవి"యని మొదలువెట్టి తెగగింజుకొని వినువారి కసహ్యాత గలుగఁజేయుటకన్న మహాపాతకము వేఱొకటి యుండునా ? అట్లని సంగీతమే వలదని నా యభిప్రాయము కాదు. పసులకాపరులు స్వభావసిద్ధముగాఁ బాడు పాట నా కెంతో సంతోషజనకమై యుండును. పరోపకార మొనరింపఁదలఁచుకొందుమేని ముందీ కట్టుఁబాటు లన్ని విషయముల లోనను నశింపఁజేయవలయును. తుంగమొక్కలు తీయక చేలు వృద్ధి నందవుకదా ! ఇందుల కెవరెంత పూనుకొని యుపకారముచేసినను వారు సాక్షాత్పరాత్పరుని యనుగ్రహమునకు నాటపట్టులు కాకతీరదు. మనకు సంగీతసాహిత్యాది సారస్యము తెలియ దని కాని, లోకజ్ఞానమే లేదని కాని యెందఱెన్నివిధముల దూషించినను పట్టినపట్టు భల్లూకపుపట్టగు నట్లుగా నిలిచి లోకమునకు మహోన్నతదశ సంపాదించితీరవలయును. క్షణభంగురమైన యీ దేహము శాశ్వతమా ? కీర్తి యనశ్వరమా ? ఒకవేళ మన యమర్త్యత్వమునకే యొప్పుకొన్నను ప్రళయాంతమందేనిఁ జావకతీరదుకదా! చూడుఁడు. ఒకమహానుభావుఁడు భూలోకమున నవతరించి యుండఁగా నేదోయొకగ్రామమున నొకకుక్క యయ్యనఘాత్మునిఁ గరచెనఁట ! దానికి వెఱ్ఱియెత్తియుండుటచేతఁ గాఁబోలు నది విషమై యతనికి మరణము కలిగింప సమకట్టుడు నతఁ డద్దాని కించుకయుఁ దలఁకక పేరు శాశ్వతము కాని వేఱొండు స్థిరతరము

కాదని యెంచి తనకుండుయావద్ద్రవ్యమును ప్రపంచ మున్నంత
కాల మప్పుడప్పుడు నియతముగాఁ గుక్కలను జంపువారికిఁ
బారితోషిక మిచ్చుటకై యేర్పఱచి దేహము త్యజించెనఁట!
ఇప్పటికిని నా యనఘాత్మునిపుణ్యకార్య మవిచ్ఛిన్నముగాజరుగు
చున్నది. "శ్లో. నరః పతితకాయోఽపి యశఃకాయేన జీవతి*"
అనుచొప్పున నాతఁ డిప్పటికేకాక యెప్పటికిని జీవించియుండుట
కేమిసందియము? మన మనుజులమో, ఆతఁ డమరుఁడో?
మీ రొక్కింత కనుగలిగి చూడుఁడు. ఇట్టి ధర్మసూక్ష్మములు
కనిపెట్టలేక యనేకులు షోడశమహాదానము లని పేరుపెట్టి
సొమ్మును వమ్మొనరించుచున్నారు. పోనిండు, తమకుఁ దెలియ
కున్నను తదేక శ్రద్ధతో యుక్తాయుక్తములు పరికించి చెప్పిన
వారిమాటలు వినరు సరికదా, కుక్కను జంపినచోఁ గాశిలో
గుడి కట్టినను పాపము పోదని పైఁగాఁ దమకుఁగల స్వల్పపు
తెలివితో గేలిసేయ నారంభింతురు. మరియొక విషయములో
గుడికట్టుటయు, విగ్రహారాధనమును యుక్తములు గనుకనా!
యీ విషయమై యాపని నొప్పుట బుద్ధిమంతుల కెట్లు సమ్మత
మగును? చెప్పినమాటచొప్పున నడవకుండుట మనస్వర్గమునకే
కాదు, నాగరికతకుఁ బుట్టినిల్లగు భూలోకమునకును నిదియే స్థితి
పట్టుచున్నది. వృథాకాలక్షేప మెందులకని సంధ్యావందనము
వలదని విద్యార్థులకు బోధింప వా రాసమయమున నేదో దేహ

* మనుష్యుఁడు మృతిపొందినను కీర్తిశరీరముతో జీవించుచున్నాఁడు.
అనఁగా.—కీర్తిశరీరము శాశ్వతమని భావము.

పరిశ్రమమేమియుఁ జేయక పోరాని వీథులకుఁ బోయి యక్కడ నేమేమో వచింపరాని వ్యాసంగములు చేయుచున్నారఁట! శృంగారకావ్యములు చదవవలదని యా యాపొత్తముల పేరులు గూడ వివరించిన "నిది మనకు మఱియును సులు" వని యెంచి ఆ పుస్తకములనే యచ్చుపడనివానింగూడ నతి పరిశ్రమమున సంపాదించి చదువుచున్నారఁట! ఇంతకును.—

"శ్లో. లోకే వ్యవాయామిషమద్యసేవా
జంతోస్తు నిత్యా నహి తత్ర చోదనా *"

అన్నట్లు వారివారిపరిశ్రమము వ్యర్థమై తుద కుపన్యాసకుల కపయశముగూడఁ గలుగుచున్నది. అట్లని మనమూరకుండ వలసినదని మాత్రము నా యభిప్రాయముకాదు. ఇంతకును బూర్వు లట్టి గ్రంథములు రచించి యుంచినప్పు డవి యెంత చేయవలయునో యంతయునుజేసికాని యింతలో నడుగంటునా? దానికే తగినంతప్రయత్నము చేయవయును. ఇదియేకాక పూర్వులు మన కెన్నిపాట్లు తెచ్చిపెట్టిరో చూడుఁడు. నిద్ర కన్నఁ బరమసౌఖ్యము వేఱుండదుకదా! అది రెప్పపాటులేక తటస్థింపదు. ఇవి రెండునుంగూడ మనవారికి లేకుండఁ జేసికొన్నారు. ఈ నిద్రాసుఖమునే మరల బ్రహ్మానందముతోఁ దామే పోల్చియున్నారు. అది యంతయు మనుష్యులపాలుచేసి

* లోకములోఁ బ్రతిజంతువునకును గ్రామ్యధర్మము. మాంసభక్షణము. మధుపానము నిత్యమే అయి యున్నవి. ఆ విషయమున చేయవలయునని ప్రేరణ అక్కఱయే లేదని భావము.

యంతకన్న నెక్కుడగువారలమని విఱ్ఱవీఁగు మనము కన్నులు తెఱచుకొని సర్వదా బాధపడుచున్నారము. ఇది పూర్వ మెప్పుడో చోరబాధకుఁ దలఁకి మనవారభ్యసించి యుందురు. నానాఁటికదియే యొక దురాచారమై బాధించుచున్నది. దీని యథార్థమును దెలిసినవారును దెలియనివారును గూడ భూలోకములో విగ్రహారాధనవలెనే సర్వసామాన్యముగాఁ బాటించుచున్నారు. మన మందఱమును తిరుగఁబడి నిలిచి పనిచేసితిమేని యీ మహానందమును త్వరలోనే సాధింపఁగలుగుదుము. ప్రప్రథమమున నాజ్యాదిహవిస్సును భక్షించుట మానుకొనవలయును. ఆ దిక్కుమాలిన మెతుకులు దారుణమగు వేఁడిమిఁ బుట్టించి క్రమముగా పైత్యములోనికి దింపఁగా మన కీదురవస్థ తటస్థించి యుండును. మనకిక్కడ ధాన్యాదులు ఫలింపకుంటచే నింతలో నది మానుకొంటిమేని యన్నమునకె మొగమువాయవలసివచ్చును. ముందు మనకు సోమరితనము వదలవలెను. మనము కానకున్నారము గాని మనవలన భూలోకములోవారు పొందుచున్న లాభ మెంతయున్నదో చూడుఁడు. స్వల్పమైన హవిస్సున కపేక్షించి మనము వర్షము గురియింప వారద్దానివలన నపారముగఁ బండించుకొని యెక్కుడు పాడిపంటలతో దులదూగుచున్నారు. ఇప్పుడు మనకు ధాన్యాదికము కావలసినచో వారెంతో మిక్కుటమైన వెలకు విక్రయింతురు. అట్టి వ్యయప్రయాసములు లేకుండ మనమేల వ్యవసాయాధికమొనరించుకొని బాగుపడఁగూడదో నాకెఱుఁగరాకున్నయది.

ఇఁక నొకటి; మన యుద్యానములలోఁ గల్పవృక్షములు తప్ప దేశాంతరములనుండెడి వృక్షలతాదు లెవ్వియుఁ గానరావు. అవి మనము నానాఁటి కియ్యెడల నాటింపవలెను. అందులో "బొమ్మజెము" డనునది కడుముఖ్యమైనది. దాని నప్పుడప్పుడు భూలోకములో మీరు చూచియుండవచ్చును. అది మిక్కిలి యుపయోగమైనదని వేఱే నొక్కి వక్కాణింపనక్కఱలేదు. ఈ స్వర్గమునకుఁ జుట్టును దానిని నెలకొల్పితిమేని యేకోటయును దానియెదుటఁ బనికిరాక దుర్గమమై యుండును. దానినిఁ బెంచుటకంత శ్రమ మక్కఱలేదు. ఐకమత్య మనఁగా దానిమట్టలనుజూచి మనము నేర్చుకో వలసినదిగా నుండును. దాని ముండ్లు మన యింద్రుఁడుఁగారి వజ్రాయుధము నధఃకరించు నని చెప్పుట కేవలస్వభావోక్తి. దానిపండ్లు కేవలరమణీయములై నిరాధారమ్ములగు నేకదృష్టులకు జీవనము కలిగించుచుండును. వ్యర్థముగా మంచిబలముగలిగి యావదనమునములనుగల్గు పండితులకు దానము లొనరించువారు వానిం జూచియైన దానపాత్రత నేర్చుకొందురుగాక! అట్టి బెట్టిదపుంగట్టన చుట్టును గలిగియున్నచో మున్ను గరుత్మంతుఁడు మన యమృతమును దస్కరింపఁగలిగెడినా? "ఎగిరివచ్చెడి పక్షుల నది యాపునా?" అని మీకు శంకగలుగవచ్చును. ఆ మట్టలను గొన్నింటెని నఱికి యమృతకలశములపై దట్టముగాఁ బఱచి యుంచితిమేని యవ్వి బ్రహ్మభేద్యములని చెప్పవలయునే? ఇట్టి యుపాయములు భూలోకము నుండి నేర్చుకోవలెను. అందులో నిప్పుడు మఱి

యును బుద్ధిమంతులు బయలుదేఱి పూర్వుల స్వార్థ్యదోషము వలన జరిగినలోపముల నన్నింటిని నివారణ చేయుచున్నారు. దేవతలమై యుండియు "పేరు గొప్ప, ఊరు దిబ్బ" అన్నట్లు నిరుపాయులమగు కతన నాలోకములో మనపేరు మూర్ఖులకుఁ బర్యాయమగు "దేవయ్య"గా మాఱినది. మనలో తలగలవారి పేరు "దేవాదిదేవయ్య" అని వాడఁబడుచున్నది. మనవిష్ణువు పేరగు "దామోదరుఁడు" అన్నది శుద్ధదరిద్రునకుఁ బర్యాయ పదమై యున్నది. ఇఁక మనకుఁ బ్రియమగువా రెవ్వారేని యున్నచో వారు "దేవానాంప్రియు" లని వాడఁబడుచున్నారు. ఆశబ్దమున కర్థము మూర్ఖుఁడని యింతకుము న్నుదాహరించిన పాణినియే నిర్ణయించియున్నాడు. "నానాఁటికిఁ దీసికట్టు నాగం భట్టూ!" అన్నట్లు మన కిట్టి దురవస్థ వచ్చియున్నది. ఇతర దేశస్థులింత తేలికగాఁ జూచుటకు ముఖ్యకారణము మనసోమరి తనమేయని చెప్పుటకన్న నందులోఁ బూర్వాచారపరాయణతం గూడఁ జేర్చినఁ గొంత యనుకూలముగా నుండును. ఇఁక మన యాఁడువాండ్ర దుస్థితివిచారింతము. "ఇంద్రాణి" అనఁగా మన దేవేంద్రుఁడుగారిభార్యయగు శచీదేవియే కదా! ఈ పేరుచేత ముండమోపిని వాడుచున్నారు. తగినంత చదువు లేదను హేతువుచే నీపెవంత చులకనగా వారుతలంచుచున్నట్లు మననేల యూహింపఁగూడదు? ఈచూపినదృష్టాంతములవలననే మనము పూర్వాచారములు వదలవలసినట్లు మీమదికి నాటియుండ వచ్చును. ఇంకను ననేకము లున్నను గ్రంథవిస్తరభయమున

నింతటితో విరమించుచున్నాను. ఇంతకును మనలోఁ దగిన గ్రంథములు లేకపోవుట గొప్పముప్పుగా నున్నయది. ఏమికాల కర్మదోషమో కాని మనపండితులు పొడుముకాయపై దశావతారములు చెక్కుటయే కాని లోకోపకారమించుకయు నెఱుఁగరు. ఇదిగాక కేవలమును కవిత్వమున కేర్పాటైనవారే మనకు లేరు. శుక్రాచార్యు లున్నను; అతఁడు రాక్షసపక్షము లోనివాఁడు; అతని కొక కన్నుగూడ లేదు. అక్కతన నంత సులభశైలిని వ్రాయలేఁడు. "తుంటికొట్టిన పండ్లు రాలినట్లు" దీనికిని దానికిని సంబంధ మేమని మీరు శంకింపనచ్చును. దాని కింకొకసారి యుత్తరము చెప్పఁదలఁచి యిప్పటికి విరమించి ప్రకృతమును ముచ్చటించుచున్నాను. ఇఁక బృహస్పతిగారు. ఈతఁడు కేవలపండితుఁడే కాని కవి గాఁడు. కొంచెము చెప్పినను నయ్యది "బలవంతప్రబ్రాహ్మణార్థ" మన్నట్లు శ్రవణకటువుగా నుండునే కాని సరసముగను సులభముగను నుండదు.

"శ్లో. కవితా వనితా చైవ స్వయమేవాగతా వరా,
బలాదాకృష్యమాణా తు సరసా విరసా భవేత్.*"

అన్నది మీ రెఱుఁగనిది కాదు. ఒక్కచోఁ దేలికశైలిగా వ్రాయఁబూనినను చిరపరిచిత మగుకతనఁ. బూర్వాచార పరిపాటి రాకమానదు. మనము పరిష్కరించినశైలి నీలోకములోఁ గవిత్వము చెప్పువారు లేరనియే నేను నొక్కిచెప్పఁ

* కవితయు, వనితయు తనంతటఁ దానుగా వచ్చినచో రసముగా నుండును. అట్లుగాక బలవంతముగా నాకర్షింపఁబడినయెడల నెంతసరసయు విరసయగును.

గలను. నే నిట్లనుట నసూయచే నని మీరు భావింతురేమో? ఇంతకుమున్ను గురుశుక్రులు రచించినపుస్తకము లున్నవికదా! అవి కేవలము విభూతిరాల్చుచున్నవో చక్కఁగా నున్నవో సహృదయులగువారు గుఱితింపఁగలరు. అందులో బృహస్పతి యున్నాఁడా! ఇతఁడు శుద్ధవైదికశిఖామణి. ఇతనికి మంత్రి యనుపేరుగూడఁ జెల్లదు. వైదికప్రధానత్వమునకుఁ గల గౌర వము భూలోకము పోయి చూచినవారికే గాని యంతగాఁ దెలియదు. కాని యిప్పుడిప్పు డచ్చట వైదికులు లౌకికులకన్న నధికనాగరికత కలిగి వారు సంధ్యావందనములచుఱకే నిషేధించి నను వీరు పాదప్రక్షాళనాదికమును గూడ నిషేధించి మహోన్నత దశలోనికి వచ్చుచున్నారు. ఏమిపాపకర్మమో కాని కొందఱు మాత్రము నాగరికత నిచ్చుభాష తుదముట్టఁ జదివి యుద్యోగు లయ్యును తమపూర్వు లాచరించి రని చెప్పి యిప్పటికిని వైశ్వ దేవాదిదుష్కృత్యము లొనరించుచు మనకుఁ గడుపునొప్పికి హేతుభూతు లగుచున్నారు. ఇవె యింతటితో విడిచి ప్రకృతాం శమునకు వత్తము. ఇఁకబుధుఁడు; ఇతడు నామమాత్రముచేతనే పండితుఁడు. ఇట్టి పండితపుత్త్రుఁడు లోకమున కేమియుపచరిం చును? ఐనను కలానిధిపుత్త్రుఁడుగూడ నైయుండుటచే నితఁడు పనికిరాఁదగినవాఁడే కాని పూర్వాచారపరాయణత యితనిని పాడుచేసిన దని శోకించుచున్నది. ఇఁక ఋషులు. వీరిని మనయి ప్పటియింద్రుఁడు గౌరవింపఁదగినదే కాని వేఱెవ్వరును దరికి రానీరు. వెనుక నహుషుఁడు స్వల్పకాలము స్వర్గమును బాలిం

చుట మీ రందఱును నెఱిఁగినదేకదా! ఆతఁడు వీరల తెలివి తేటలు చక్కఁగా గ్రహించినవాఁడు కనుకనే పల్లకీబోయీల క్రింద నియోగించినాఁడు. ఆప్రభువు కొలదికాలముననే యపు నంటెను గాని కానిచో మనస్వర్గమున కెక్కుఁడుమర్యాద గలుగఁజేయఁదగినవాఁ డనుటకు సందియము లేదు. ఇంతకును శచీదేవిపూర్వాచారపరాయణత యతని కాపద గల్గించినది. వ్యభిచారము తప్పు గాని తనభర్త యొక్కడికో పోయి వార్తయేని తెలియరాకున్నసమయమునఁ దాను వేఱొక్కని వరించుట తప్పు గాదని యామె కెంచుకయుఁ దోఁచకపోవుట కడు నబ్బురముగా నున్నయది ఆపెతప్పేమి? విద్యావిహీనలగు స్త్రీలకిట్టిధర్మసూక్ష్మము లెట్లు పొడకట్టెడిని? ఒకవేళ శచీదేవి ధర్మాధర్మము లెఱిఁగినదే యైనను గావచ్చును గాని యిప్పటివలె భూలోకమునఁగూడ స్త్రీపునఃపరిణయబోధకములగుసులభశైలి పుస్తకము లప్పటికి లేకుంటచే నాపెకట్టిబుద్ధి పుట్టకపోవచ్చును. నహుషునిరాజ్యభ్రష్టతకుఁ గారణము ఋషిశాప మని మనవారనేకులు చెప్పుచున్నారు గాని నా కది యంత నమ్మకముగాఁ దోఁచదు. ఆఋషులకట్టిబొటు లన్నియుఁ దప్పు లని సిరాఘాటముగా నేను చెప్పుచున్నాఁడను గదా! వారి కట్టిశక్తియే నిజముగా నున్నచో నన్నేల శపింపఁగూడదో? ఆసంగతిని మీరే యోజించుకొనుఁడు. ఆతఁడు కొండచిలువ యైన సంగతికూడ నంతగా విశ్వాస్యము కాదు. ఏకారణముచేతనో రాజ్యము మాత్రము పోయియుండును. దానికి సంఘసంస్కరణ మప్ప

టికి లేకపోవుటయే ముఖ్యకారణ మని నాయభిప్రాయము. ఆయుష్మానుభావునిదినములలోనే మనస్వర్గమునఁగొంచెముగొప్ప భూలోకభావలు వ్యాపించినవి. ఆహేతువుచేతనే మన మిప్పు డామూగ్రంథములు తెప్పించికొనినయెడ నానాఁటికి బాగుపడుట కవకాశ మిచ్చు నని తోఁచుచున్నది. ఇప్పు డేసుకృతజ్ఞానము నకు దానకములగు సులభశైలిపుస్తకములు భూలోకమున నాంధ్రాదిదేశములలో కొల్లకొల్లలుగా నున్నవి యని చెప్పియే యున్నాను. వానిం దెప్పించి మనమూ టిప్పుణంత ముందు మనస్త్రీలచేఁజదివించవలెను. ఆగ్రంథముల సాహాయ్యముననే భూలోకమున స్త్రీ లెల్లరును గాకపోయినఁ గొందఱైనను దేవి తేజము కలవారై నాగరికత కునికిపట్టులై సమాజము లేర్ప అచుకొని స్వయముగా నుపన్యాసములుకూడ నిచ్చుచున్నారు. అందులోఁ గొందఱు ప్రోడలు భయముదీరి సిగ్గు విడిచి యనేక పురుషవ్యాఘ్రములుగల సభాగృహములయందుఁగూడఁ దమ కున్నశక్తిని ప్రకటించుచు నుపన్యాసము లిచ్చుచున్నారు. కాని యిట్టినాగరికత సంపాదించియు వారేలొకో పూర్వాచారపరా యణతను వ్రతాద్యాచారములవలన నింకను వెలిబుచ్చుచునే యున్నారు. అయ్యది కేవలము వినికిమాత్రముననే కాక వారు ప్రత్యేకము నధికారిణులుగానున్న పత్రికలయందుఁగూడఁ గన్ప ట్టుటకెంతయుఁజింతించుచున్నారము. ఆవ్రతాదికము మన్నించు చున్నంతవఱకును వీరు పరిపూర్ణనాగరికతను బొందలేదనియే మాయభిప్రాయము. వీరికి మార్గప్రదర్శకు లట్టి వ్రతముల నంగీ

కరించనందున నిష్కారణముగా గురుద్రోహమున కొడిగట్టుచు న్నట్లు లైనది. వ్రతములలో నాచారము, దానిలో గోమయము దానిలో బ్రాహ్మణపూజ, దానిలో సపాత్రదానములు, విగ్రహారాధనము. ఇవి యన్నియును వీరి నడుగంటఁ ద్రొక్కక యేల యూరకుండును? ఇంతకాలమునుండి వీరివిషయమై ప్రాజ్ఞులు చేసినపరిశ్రమ మంతయు వ్యర్థమే యని మాయభిప్రాయము. ఏమన, ఏ రాయావిద్యలు నేర్చియుండియును శుభకార్యములలోఁదామేసభ్యులనానందపెట్టక వేశ్యాపిశాచములమేళములనే తమయిండ్లకుఁ బిలువ నంగీకరించుచున్నందులకు మావిచారము పట్టలేకపోవుచున్నారము. విద్య యనునది తామానందించుటకే పుట్టక యొరులయానందమునకుఁగూడ భగవంతుఁ డుద్దేశించి నట్లు మేము దృఢముగాఁ జెప్పఁగలము. అందులో సంగీతాభినయములు చెప్పనేయక్కఱలేదు. లజ్జ యనునది పూర్వాచారపరాయణు లొప్పవలసినదేకాని మే మంగీకరించువారము కాము. అందులో స్త్రీలకు బొత్తిగాఁ బనికిరాదు. వ్యభిచారము దక్క స్త్రీల కెయ్యదియును దోష మాపాదింప నేరదు. అట్టిచో ఏ రిట్లు సంశయింపనేమిటికి? ఓహో! భూలోకవాసినులగునాగరికపతివ్రతాశిరోమణులారా! మీరు విద్యలు నేర్చుట కేమిసార్థక్యము? "శ్లో. అంతర్గూఢగుడాయతే, బహిర్వ్యక్తుం నశక్యతే" అన్నట్లు లోలోన గొణిగికొనుట కన్నఁ బొరపాటుండునే? అందుల కిప్పటి సంస్కృతపండితులు చాలరా? మీరుకూడ నదేఫక్కి నవలంబించున్నారేమి? జాతి

మతాదిద్వేషములవలెనే స్త్రీపురుషాదిభేదములు కలలోనైనఁ దలఁపక మహాసభలలో మీ రేల యుపన్యసింపఁగోరుచున్నారు? మీకు లజ్జ యుండవలెనని విధించిన పూర్వులు స్వార్థపరు లని యేల తెలిసికోకున్నారు? "శ్లో. నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అన్నమనుస్మృతియే మీ కిప్పటికిని ముఖ్యమగుచున్నదా? పూర్వపుగ్రంథములు చదువవల దని యెన్నిసార్లు బోధింపవలెను? వానివలన విరుద్ధజ్ఞానోత్పత్తి కలిగియేకదా మనపూర్వులు వెఱ్ఱియెత్తి తాము పాడగుటయుండ "తాఁజెడ్డ కోఁతి వనమెల్లఁ గాల్చె" నన్నచందమ్మునఁ బ్రపంచము నెల్లఁ జెఱచినారు. ఆంజనేయులు తోఁక పెంచుట, రావణాసురునికి పదితలకాయ లుండుట, సీత యగ్నిలో దుమికి కాలిపోకుండుట, రాముఁడు సప్తతాళములు నఱకుట, ఈశ్వరునకు విల్లు పర్వతమగుట, సముద్రమును కోతులు దాఁటుట మొదలగువెఱ్ఱి కథలు చదువుచున్నంతకాలము మీ రెట్లు నాగరికత పడయనేర్తురు? ఆ యా యాగ్రంథములలోనిగాథలే మీరు పఠింపనెంచినచో విరుద్ధములు సవరణచేసి వ్రాసినపుస్తకములు చదువుకొనుఁడు. భర్త తనపై నించుక యనాదరము చూపినంతలో నగ్నిం బడనెంచిన సీతచరిత్రము మీకు స్వాతంత్ర్యభంజకమగుటట్లుండ మగఁడుపోయినపిమ్మటనేని యొప్పుకొన దగనియగ్నిప్రవేశమును నాథుఁ డున్నప్పుడుగూడ విధించుచున్నదికదా! ఇంతకన్న దుర్నీతి యెందుండును? సభాకంపమును గలిగించెడు విద్య చెడువిద్య యని మీ రికనేనిఁ దెలిసికొని తగినంతస్వా

తంత్ర్య మవలంబించి భర్తలకు బానిసలై యుండు తోడిసంసారిణులన్ గూడఁ దగినంత శీఘ్రకాలమున నుద్ధరింపుఁడు. అందులకు సమాజోపన్యాసములు ముఖ్యము. కుటుంబమహాసముద్రమున నీఁదుచుండెడిమీకు దూరదేశములలో నయ్యెడిమహాసభలకుఁ బోయి యుపన్యసించి లోకము నుద్ధరించుటకు వీలు గాకున్నను మీమీగృహములఁ దటస్థించెడిశుభకార్యములలో బంధువర్గము లొక్కచోటికిం గూడుచుండును గావున నట్టియెడల మీ వాక్సుధాధార లెల్లరహృదయములకెక్కించి సభదీర్చి యుండు సమయమ్ములు సార్థకమ్ము లొనరింపక దిక్కుమాలినవేశ్యల బూతుకూఁతలతో నేల కాలక్షేపము చేయనిచ్చుచున్నారో నే మరయ లేకున్నారము. పంచభక్ష్యపరమాన్నములతో విందులకు విందులొనర్చుటకన్న నిట్టిపట్టున దోస మేమున్నదని మీరు భావించితిరో మాకుఁ బోడకట్టకున్నయది. పరమాత్మను దెలిసికొనుటకు బాహ్యావేషములవలెనే పాతివ్రత్యమునకు లజ్జాద్యాడంబరంబు లనవసరములు. మీకు పతివ్రతలుగా నుండుటకు భర్త్రాదులచేఁ గల్పింపఁబడిన "ఘోషా" లు మొదలైన వంత పాటింపఁదగినవా ? చూడుఁడు.

" క. శీలమున మానరక్షణ
మేలలన యొనర్చు నద్దియే సతి భర్తల్
పాలింపఁ బతివ్రత లగు
లీలావతు లెందఱేని లేరె జగమునన్. "

అని యింద్రుఁడు నహుషరాజ్యకాలమ్మున నతనికిఁ గొంకి నీ వనుగ్రహించినఁ గాని నా పాతివ్రత్యము నిలువనేరదని దుఃఖించు శచీదేవికిఁ బ్రత్యుత్తర మిచ్చియున్నాఁడు. దీనిం దెలియ నుంకింతురేని దేవీభాగవత షష్ఠస్కంధమ్మునం జూచు కొనుఁడు. అట్లన యీ దేవీభాగవత మంతయుఁ బ్రమాణముగా నెంచుకొంటిరేనిఁ జెడిపోయెదరు సుఁడీ? అందుఁగోఁ గలియుగ ధర్మము లని మొదలువెట్టి యిప్పుడు సంఘసంస్కరణ కర్తలు మన కేర్పఱచిన మంచికార్యమ్ము లన్నియు దుష్టములుగా నిందించియున్నాఁడు. వేదాదులంద బోత్తిగాఁ బనికిరాదనియు నట్టిపని చేసినవారు మహాపాపాత్ము లనియుఁ గూడ వ్రాయుట యట్లుండ ననేకవిరుద్ధాంశములు బోధింపఁబడియున్నవి. కాని శక్తియే జగత్కారణ మని యొప్పుటవలన స్త్రీల కెక్కుడు స్వాతంత్రము పలుచోట్ల నిర్ణయింప బడియున్నది. ఆవిషయము మీకిప్పుడు ముఖ్యమైనదే కనుక నందులకై యీ పురాణము నొక్కసారి చదివి హంస నీరమునువదలి క్షీరమును గ్రహించిన తెఱఁగునఁ బ్రకృతము మీకుఁ గావలసినంతవఱకు గ్రహింపుఁడు. పుట్టలలోఁ బాలుపోయుట, దేవాలయములలోనికి నేఁగుట, తీర్థయాత్రాదిక మొనర్చుట, బ్రాహ్మణులకు నమస్కరించుట, తులసి నారాధించుట, దీపములు పెట్టుట మొదలైన వ్యర్థకార్యములు త్వరలోఁ గట్టిపెట్టుఁడు. విద్యార్థులకు వారములు గాని, మాధుకరము గాని మీభర్తలు సమ్మతించి నను మీరు సమ్మతింపకుఁడు. గ్రుడ్డివాండ్రు కుంటివాండ్రు మొద

లగు నసమర్థులకుఁ దప్ప మీ ద్రవ్యము వినియోగింపకుఁడు. ఒకవేళ మీకు చిరపరిచితివశమ్మున వ్రతాదులు మాననేరరేని యమ్యెడల నేవర్ణమేనియు నగుఁగాక! పంగ్వంధవికలులనే యారాధింపుఁడు. దాన నిహలోకమ్మునఁ గొందఱు మిమ్ము నవ్వినను పరలోకమునకు హానియుండఁగూడదు. "వ్రతములలో మాలమాదిగల నెట్లారాధింతు?" మని మీరు శంకింపవచ్చును. జాతిమతాది ద్వేషము లనసరము లేదనుటచేతనే మీకు త్తర మిచ్చినట్లే యైనను నింకను మీకు చేద స్తము వదలకున్నందున నట్టియెడ నారాధించు బ్రాహ్మణులనేనియు గ్రుడ్డివారినిగానో కుంటివారినిగానో చూచి పూజింపుడు. "అట్టివారు చదువు కొన్నవారుగా నుండరేమో" అని మీరు శంకింపవచ్చును. కుంటివాండ్ర నేకులు చదివినవారు గలరు. గ్రుడ్డివారిలో సయితమట్టివారు దొరుకుదురు.

"క. విను మూర్ఖులైనద్విజులకు
ధన మీవల దిచ్చెనే నుదర పోషణకుఁ
గని పెట్టి యీవలయు లం
ఘన మొనరింపగఁ దగదుగా! ధర్మములన్"

ఇదియును దేవీభాగవతములోనిదే. కనుక నెల్లరకును నొక్కసారిగ వ్రతములు వచ్చుటచే బ్రాహ్మణులలో నింద ఱొక్కసారి గ్రుడ్డివారుగాని తదితరులు గాని దొరకక పోవచ్చును. ఇదిగాక మీ రట్టివారికిఁ దప్ప దానాదిక మొసఁగ [illegible] తెలిసి వారు స్వోదరపోషణమ్మున కదియును నొకయాధార

ముగా నెంచుకొని బలవంతముగాఁ గన్నులు పోగొట్టికొనుట
మొదలగు దుండగములుకూడ నొనరింపవచ్చును. కనుక జాతి
మతాదిద్వేషములు పాటింపనిచో నట్టివా రనేకులు దొరక
వచ్చును. పేరంటమునకుఁ గావలసినచో నెందఱో యాఁడు
వాండ్రుగూడ సువాసినులే యట్టివా రున్నారు. దంపతులు
గావలసినచో నందలకొలఁది వారలును దటస్థింపుదురు. ఇంతకును
మీా నెఱ్ఱి కుదుర్చుటకుఁ జెప్పుచుంటిమే కాని వ్రతములు
చేయుట యవసరమని మా యభిప్రాయము కాదు. "పోనిండు ;
జరుగుఁబాటు కలవారు అసమర్థులకుఁ బెట్టుచు నిట్టికార్యములలో
బ్రాహ్మణులనే యేల యారాధింపరా ?" దని శంకింతురేమో ?
అట్లయిన జాతిమతద్వేషములు వదలకపోవు టట్లుండ భగ
వంతుఁ డొసంగిన కరచరణాద్యవయవము లవ్వారికి మీారు
విఱుగఁ గొట్టినవా రగుట కేమిసందియము ? అంతకన్న
భగవంతుని దృష్టికిఁ బాతక మెందుండునే ? కావున మిమ్ము
వ్రతాదులు మానుఁ డని చెప్పుటకే యివి మఱియొక
మాటలుగా నెంచుకొని యయ్యవి మానుకొనుఁడు. అంతవఱ
కును మహోన్నతదశ మీారు పొందినట్లు మే మూహింపము.
దేవతలనఁగా నెవరో కారు. మేమే. మాకును మీాకును భేదము
లేదు. కరచరణాదు లన్నియు తుల్యములే. ఇంతకుమున్ను మాల
మాదిగలను మీా రెట్లుహీనులుగాఁ జూచుచుండిరో మేమును
మీాయెడల నంతగాకపోయినను గొంతమైనను భేదము పాటించు
చుంటిమి. అయ్యది మీాలోకమున బయలు దేఱిన సంఘసంస్క-

ర్తలు మాకుఁగూడ బోఁగొట్టి సర్వసమత్వ మాపాదించిరి. ఇఁక మమ్ము మీ రెందులకారాధింపవలయును? మున్ను మా స్వగస్థితి బాల్యదశలో నుంటచే మీ యారాధన లంగీకరించినను నిప్పుడు నిద్దురవిడిచి కనులు తెఱచినాము గనుక మీ పూజలలో మా కవసరము లేశమైనను లేదు. పౌత్తరలు గట్టువార లుద్యోగము లకు వచ్చినపిదప వాని నెల్లిగ ర్తింతురో మేముకు నేదో యొక వాణిజ్యమో మఱియొకటో చూచుకొని హావిర్భాగాదులు మనఃపూర్వకముగాఁ బరిత్యజించుచున్నారము. ఓహో! స్త్రీ లను గుఱించి చెప్పుచుఁ బ్రకృతాంశమును వదలినందులకు మన్నింపుఁడు. మన లోకముగతి యిట్లుండఁగా భూలోకముకకుఁ గూడ మనము నీతులుగఱపుట "ఉట్టికెగురలేనమ్మ స్వర్గమున కెగిరె" నను పూర్వపు సామెతవంటిది గాకుండునే? ఇది మొదలు మనము సురాదిశబ్దములచే వ్యవహరింపఁబడుట తగ్గించుకొనవల యును. దీనివలనఁ గలుగు నష్టములు మీ రెఱుఁగక పోవచ్చును. అప్రధానముగా నీ సురాదిశబ్దములను వహించుచున్న భూసురులు సోమరిపోతులలో మొదటివారై చెడిపోవుచున్నప్పుడు ప్రధాన ముగా వహించు మనము పాడగుట కేమి యాశ్చర్యము? ఇఁక నొకటి; యీ సురశబ్దమును తెలుఁగులో స్త్రీసమముగా వాడు చున్నారు. అది మన తెలివితేటలనుబట్టి వారు మనలను ధిక్క రించుట గాని మఱియొకటి గాదు. వారిలో భార్యావాచక మగు దారాశబ్దమును బుంలింగముగా వాడుకొనుచున్నారు. వారి యాఁడువాండ్రు పురుషులవంటివారనియు మనమందఱమును

నాఁడుదానికన్న నధములమనియు వారి యభిప్రాయము గావ చ్చును. ఇంకను నిట్టి వనేకములు చూపవచ్చును. మనము మూర్ఖతచేఁ దెలిసికొనలేదుగాని మన దేవతాశబ్దమే మనకు స్త్రీత్వ మాపాదించుచున్నది. "మగఁ డొకటి కొడితే మఘూ కరపువాఁ డొకటి కొట్టినట్లు" వారిదేమి తప్పున్నది? మన మెఱుఁగలేక స్వార్థపరులగు బృహస్పత్యాదులవలన నిట్టి దుస్థితికి నచ్చితిమి. ఈ పేళ్ళన్నియు మనకుఁ బురోహితుఁ డగుటచే నితఁడే పెట్టియున్నాఁడు. గతజలసేతుబంధనమువలన నేమి ప్రయోజనము? కాని, యికముందైనను మనము చక్కని పేరు పెట్టుకొనవలెను. అట్టిది జంతుశబ్ద మొకటి కనుపట్టుచున్నది. ఇది యంత జాతిమతాదిద్వేషాపాదకముగా లేదు. పశుపక్ష్యా దులనుగూడ మనము సంబంధబాంధవ్యములచేఁ గలుపుకొన్నను నియ్యది విరుద్ధముగాఁ దోఁపింపదు. అంత యదృష్టము మనకుఁ బట్టి శిలావృక్షాదులన్ గూడఁ జేర్చుకొంటిమేని అప్పు డిద్దానిన్ ద్యజించి పదార్థపదముచే వాడఁబడుదను. ఓ యీశ్వరా! మా కట్టి సర్వసమత్వ మెన్నఁటికిఁ గలిగించెదవు? నీ దృష్టికి సర్వము నొక్కటియేకదా! లేనిచో నీకు సర్వసముఁ డనుమాట యెట్లు చెల్లెడిని? ఇఁక నొకటి మనలో గొప్పదురాచారముగా నున్నది. స్త్రీలే గర్భిణులగుటయుఁ బురుషు లట్టిభారమును వహింపకుండు "టయు మీ రెఱిఁగినదే. ఇఁకముం దట్లు గాక మాన మీ భార మును కొంత వహించుచుండవలెను. అబల లను సంగతి మన మెఱిఁగియు నింతటిభారము వారలపైఁ బ్రత్యేకముగా నిడుట

మనకు ధర్మ మెట్లగును? "ఇప్పటికి మన స్త్రీల కట్టిభాగ్యనే లేదుకదా! ఈ చట్ట మెందుల కవసర" మని మీరు శంకింప వచ్చును. ఇఁక ముందేని యిట్లు చేయవలె నని మీరు గ్రహింతురుగాక! స్త్రీలు మనతో సర్వవిషయములచేతను దులఁదూఁగ వలయు ననియే నా యభిప్రాయము కాని వేఱొండు కాదు. మనకు రాజ్యాంగసంస్కరణ మొకటి ముఖ్యావసరము. "అక్కడను నిన్నే తగులఁబెట్టు మన్నా" రన్నట్లు బృహస్పతియే దానికి ముఖ్యప్రతిబంధకుఁడు. ఈ వైదికప్రధానత్వము తగ్గింపవలయు నని వెనుకఁ జెప్పియే యున్నాను. హవిర్భాగాదిక మింద్రుఁడు గూడ దినకుండునట్లు కట్టుఁబాటు జరుగవలయును. దానితో పాటుగా నచ్చరలను సభకు రానీకుండుట, వారలతో నితఁడు వ్యభిచారాదికమున కియ్యకొనకుండుట, శృంగారకావ్యములు వినకుండుట మొదలైనవి యావశ్యకము లని వేఱే చెప్పనక్కఱ లేదు. "కావ్యాలాపాంశ్చ వర్జయే" త్తనుటవలన మొట్టమొదటికిఁ గావ్యములే వినుట మానినచోఁ గొంత యుక్తముగా నుండును గాని పూర్వపుకావ్యములవలెఁ గాక పఠనపాఠన యోగ్యములగు కావ్యములేమి, యితరగ్రంథము లేమి యొక మాదిరి యాంధ్రాదికవులచే నిప్పుడు భూలోకమున రచింపఁబడు చుండుటచే నయ్యవి గర్హ్యములు గావు గనుక వానిని వినుట యొప్పుకొనవచ్చును. "శ్లో॥ వాణిజ్యే వర్తతే లక్ష్మీః" అనుట వలన వృత్తులలో వాణిజ్యము మంచిది గనుక మన మద్దాని నవలంబించి జీవింపవలసి యుండును. ఇఁక ఋషులున్నారు.

వా రింటు దోషము లనేకము లుండునని యిందుల కంగీకరింపరు. వారికి భృతకోపాధ్యాయత్వ మేర్పఱచవలయును. అందుల కేని వారు సుఖసుఖాల నొందఁబడరు. హోమాదు లన్నియు భూలోకమున నడుగంటినపిదప జీవనార్థ మేదో యొకవృత్తి నేల యంగీకరింపరో చూతము. మొట్టమొదట భూలోకమునందును నిట్లనే పండితులు తెగనీలిగి తుద కందఱును గాకున్నను నందు గొంద ఱిప్పటికి నొప్పుకొని యిప్పుడిప్పుడు మాలమాదిగలు విద్యార్థులుగాఁ గల పాఠశాలలలో సయితము నుపాధ్యాయత్వము నంగీకరించుచున్నారు. ఈ విషయమును వారిం జూచియైనను వీరు నేర్చుకొందురు. లేదా తిండి లేక మాడి చత్తురు మన కేమి? యింతకన్న వీరికి గతి గల్పింపలేము. వారు మనల నెంత శత్రువులుగాఁ జూచినను వారియెడల మనకు నిజమైన శత్రుత్వము లేదు గనుక నిట్లేర్పఱచితిమి. ఆదరించు రాజులు లేక భూలోకమున సంగీతపాఠకులు వేశ్యల కుపాధ్యాయత్వమొనరించి జీవించుచున్నారు. కొందఱు మాత్రము కులస్త్రీల కది ముఖ్య మని నాగరికతగల గృహస్థులు చెప్పించుచుంటచే నక్కఁతమునఁ బొట్టఁ బోసికొనుచున్నారు. అట్లనే యిక్కడి తుంబురునారదులున్ను నిప్పటికి జీవింతురుగాక! నాగరికత ప్రబలినకొలఁదిని వేశ్యావృత్తి యడుగంటును గాన వారలను మనస్త్రీలవలననే పోషింపఁబడువారినిగా నేర్పఱచుకొందము. అది యిప్పటిసంగతి కాదు. కొంతవఱ కాలోచించిన నీ గాయకులచే మనము చెప్పించుట కొంత వ్యభిచారకారణమే కాని; అయినను భూలోకములో

వారికన్న నీయెడల మనము తెలివితేటలు కలవారము కాము గనుక నట్టి సంశయమును బొందఁగూడదు. ఈ రంభాదులచేఁ జెప్పించినను జెప్పించవచ్చును. దానివలనను గొన్నిదోషములు కన్పట్టుచున్నవి. కాని ; అట్లయినచో స్త్రీవిద్య వర్ధిల్లదు. అది సంఘ సంస్కరణమున కత్యావశ్యక మని యనేకవిధములఁ జెప్పియే యున్నాఁడను. ఇఁకనొకటి. "ముఖ్యమైన సంగతులు చూచుకొనక వేదాదికమును పూర్వాచారములను నిందించి సర్వవిషయములలోఁగూడ నిన్నిమార్పు లెందులకుఁ గావల యును" అని మీరు శంకింపవచ్చును. "తీఁగ గదిలితే డొంక గదలు" నని మీ రెఱుఁగుదురు గనుక నా విషయమై వేఱే సమాధానము చెప్పఁ దలఁచుకొనలేదు. ఈ యొక్కటిరెండు సంగతు లైనను మనమింత యల్లరి చేసినపిమ్మటంగాని పూర్వా చారపరాయణు లంగీకరింప రని యింతవఱకు చేటభారతము పెంచవలసి వచ్చినది. అట్లని యీ సంగతులు మంచివి కావని మీ రభిప్రాయపడెదరు సుఁడీ! అట్లు స్వప్నములో నయినను తలంపకుఁడు. ఊరకే యిట్లు చెప్పితినే కాని నేను చెప్పినమార్పు లన్నియు నంగీకరించినం గాని మనకు మహోన్నతదశ పట్టనే పట్టదు.

ఇఁక మన మవలంబించవలసిన ముఖ్యమైన వృత్తులు గొన్నింటి నుదాహరించి ప్రసిద్ధిగన్న మహాపతివ్రతల చరిత్ర ములు దిఙ్మాత్రముగా వ్రాక్రుచ్చివిరమించుచున్నాఁడను. మనము వాణిజ్యములోనికి దిగవలయు నని చెప్పియేయున్నాను. దానిని

కూర్చి యోజింపఁగా వంటపూటివ్యాపారము కడు లాభకా
రిగాఁ గనుపట్టుచున్నది. ఇట్లనుటచేఁ దక్కినవి మంచివి కావని
నా యభిప్రాయము కాదు. అందులో నియ్యది సులువుగా నవ
లంబించఁదగినదియు నెప్పటికప్పుడు తగినంత లాభమును జూపిం
చునదియు నని చెప్పవచ్చును. "వాణిజ్యం ధనమూలకమ్" అని
యున్నను దీని కంత విశేషద్రవ్యము ముందుండనవసరము లేదు.
దీనిని గుఱించి పూర్వు లనేకవిధముల నిందించియున్నారు కాని
యయ్యవి మనము పాటింపఁగూడదు. ఇది విద్యాభివృద్ధికిఁ
బ్రథమకారణము. వర్తకము మొదలగు వ్యాపారముల కియ్యది
పట్టుగొమ్మ. ఇయ్యది పురుషులును, వితంతువులగు స్త్రీలునుగూడ
నవలంబించవచ్చును. పూర్వకాలమం దెట్లైనను నిప్పటికాలమున
నియ్యది సర్వజనోపకారక మనుటకు సందియము లేదు. కాని
దీనిని నవలంబించినవా రిప్పటికిని జాతిమతాది ద్వేషములు
పాటించి వేఱువేఱుపంక్తులుగా భోజనములు పెట్టుచున్నారు.
ఈ సంగతి మా కంతసమ్మతముగా లేదు. ఇది మనలోఁగొందఱు
పరిగ్రహింపఁదగిన వాణిజ్యరాజము. ఇఁక రెండవది; కటికివ్యాపా
రము. ఇది కడుఁ జక్కనైనవర్తకము. దీనిపరమార్థము గుఱు
తెఱుంగక యనేకు లిద్దాని నొనరించువారిని దూషింతురు.
దేహదార్ఢ్య మున్నన్గాని యేజంతువును నెందులకున్ గొఱ
గాదు. అందులకు కండ ముఖ్యము. "శ్లో॥ మాంసం మాంసేన
వర్ధతే." అనుటవలన దాని కియ్యది ముఖ్యము. నరమాంసము
మొదలు సమస్తజంతువులను భక్షింతురు గనుకనే రాక్షసులు

మనకన్న నెక్కుడుబలిష్ఠులుగా నున్నారు. "మనము మాత్రము మాంసభుక్కులము కామా?" అని మీరు శంకింపవచ్చును. సదో యొకజంతువును జంపి దానియవయవము లొక్కొకరికి నిద్దఱిద్దఱికి భాగములుగా నేర్పఱచి యజ్ఞకర్త లిచ్చెడిదానివలన మన కేమిబలము గల్గెడిని? అత్యశనమువలెనే యల్పాశనమును ననుపయుక్తమే కదా! అందులకై యీ వర్తకమునకై కొంత యేర్పాటుగా నున్నచోఁ గావలసినంత మాంసము ధన మిచ్చి తీసికొనవచ్చును. ముందు మనలోఁ బేదగలవారు కొంద ఱీవృత్తికిఁగూడ దిగవలెను. ఇది మంచివృత్తి యనుటకు భారతములోని ధర్మవ్యాధుఁడే మనకుఁ జాలును. అతఁ డేదో పూర్వజన్మాదిసంగతులు కొన్ని చెప్పియున్నాఁడు. అవి మనము పాటింపవలసినయవసరము లేదు. ఈ వృత్తివలన భూలోకములో నిప్పుడున్న గొప్పయుపకార మేమనఁగా? ముసలిగొడ్లను మేప లేనిరైతు లనేకులు సుఖపడుచున్నారు. ఇదిగాక యీ వర్తకమే లేనిచో మేఁకలు కడు వృద్ధి చెంది భూలోకము పట్టకపోవలసి వచ్చును. ఎక్కడ లేనికసవును నివియే భక్షించుటచే నానాఁటికి సస్యవృద్ధి బొత్తిగాఁ దఱిగిపోయి దేశము బీదతనముపాలై చెడి పోవు నని వేఱే చెప్పనక్కఱలేదు. "జీవహింస నామమాత్రావ శేష మొనరించిన మహానుభావుఁడగు బుద్ధుఁ డీపాటియూహ లేనివాఁ డగునా?" అని మీరు శంకింపవచ్చును. అతఁ డెట్టివాఁ డైనను నిప్పటికిఁ బూర్వులలోనే చేరుటచే నిందులకుఁ గ్రొత్తగా నెంత్తర మనసరము లేదు. ఈ వ్యాపారముతోపాటు కొమ్ముల

వ్యాపారమును, క్షౌరవృత్తకమును జూచుకొనునది. ఆ రెంటికిని నియ్యదియే కారణము గనుక నిద్దానిగుణాధిక్యముం బ్రశంసించితిని. ఇఁక నొకటి ; “ ఈ వృత్తకము లనాదిగాఁ జేయుచున్న వర్ణములే కాని తదితరులు చేయరా ” దని కొందఱు పూర్వాచారపారీణులు బోధింతురేమో ? అందులకు జాతిమతాది ద్వేషములను ఖండించిన మా కుత్తర మతిసులభము. అందఱును అన్ని వృత్తులును చేయవచ్చును. వృథాగా ద్రవ్యము పాడుచేసికొని బీదతనమునకు వచ్చుచున్న భూలోకవాసు లనేకు లిప్పుడు నాగరికత ప్రబలి బాగుపడుచుండుట కెంతయు సంతసించుచు వారు సర్వసామాన్యముగా నవలంబించుచున్న యింకొకవృత్తి నిందుదాహరించుచున్నాఁడను. క్షౌరము: ఇది యెవరికి వారే చేసికొనఁదగినది. దీనికిఁ బ్రయాణాదులకుంబలె శుభముహూర్తము తేర్పఱచెడిపూర్వుల నించుకయు విశ్వసింపఁదగదు. ఇది ప్రాతఃకాలమునందే కావలయు నని నియమము బొత్తిగాఁ బాటింపఁదగదు. వృద్ధులగునుద్యోగులు తమపై యధికారులు వచ్చునప్పుడిద్దానికతమున నే పడుచువాండ్రు కావచ్చును. నానావిషయములను నియ్యది పడుచుఁదనము గలిగించుట కేవిధమైనయభ్యంతరమును నుండదు. అట్టిదీనికిఁ గాలనియమము కాని, యితరాపేక్ష గాని యుండుట యెంతముప్పో యోజించుట మీకే వదలిపెట్టుచున్నాను. ఇది తమంతటఁ దామే యొనరించికొనుట దోషమని చెప్పు పూర్వాచారపరాయణులపై మన మిచ్చు

పూర్వపక్షము దుర్వార మని వేఱే చెప్పనక్కఱలేదు. "పాయి తిన్నా కంపే గడ్డతిన్నా కంపే" అనుట యెవ రెఱుఁగనిది? ఇదియే కాక యుక్తియుక్తసంబంధము తాము కలుగఁజేసికొని చోఁ దుదనెగ్గని యాయాపనులన్నియు శరీరమునకుఁ జేరినంత వఱకు నితరులచేఁ జేయించుకొని సొమ్ము వమ్మొనరించు టట్లుండ నాపని చేయువారల నతినీచులుగా నేర్పఱచుట కన్నఁ దమరే యాయాకృతులకుఁ జొరఁబడి సోమరితనము సాధ్యమైనంతవఱకు నశింపఁజేయుదు రని నమ్ముచున్నాను. ఇది యిట్లుండఁగా స్త్రీలకుఁ బ్రత్యేకముగా గ్రంథములు బయలు దేఱువఱకును వారివిద్య యభివృద్ధి నందనేరదు. అందులకై వీలుగా వ్రాయదగినకవులు మనలో లేరని చెప్పియేయున్నాఁ డను. సంఘసంస్కారిణులుగా నుండుపతివ్రతలను మాత్రమే యందు ముఖ్యముగా గ్రహింపవలయును. అందులోఁ గొంద ఱిని జెప్పుచున్నాఁడను:—

## తాటక

ఈమె మహానుభావురాలయిన సంఘసంస్కర్త్రి నాబడు పతివ్రతాశిరోవతంసము. "దేవునై గురువునై" అన్నట్లు సంచరించినట్లు పూర్వగ్రంథములయందు వ్రాయఁబడియున్నను, అయ్యది పాటింపఁదగినది కాదు. ఈమె పరమాస్తికురాలు. ఆస్తికతమునసే ఋషివాతకు లొనర్చెడి యజ్ఞాదిదుష్కర్మములు

వారింప నెంచెడిది. ఇది సంస్కరణమున కెంత ముఖ్యమో చూడుడు. ఈపెకు ముఖ్యశత్రువు విశ్వామిత్త్రుడు. అతఁడు నామమాత్రముననే యెల్లరకును శత్రు వనుట కేవిధమైన యాక్షేపణయు లేదుగదా! ఇటీవల వైయాకరణు లని బయలు దేరి యేదో యొకసూత్రమును సృష్టించి యాతనిని సర్వమిత్త్రునిగా సమర్థించినారు. అది యంతగా విశ్వసింపఁదగినది కాదు. ఏది యెట్లైనను సర్వలోకోపకారిణియగు తాటకామహాదేవికి నరిపక్షముననున్న యితని నిట్లు చెప్పుటకన్నఁ దప్పిద మేముండెడిని? ఆపెకు యజ్ఞాదిదుష్టకార్యము లిష్టములే దని తెల్పియే యున్నాఁడను. ఈవిషయము సంఘసంస్కర్తలకు ముఖ్యముగా నుండఁదగిన దే కనుక నిందుచేతనే యయోగ్యురా లనుటకువల నుపడదు. ఆపెయందిష్టములేనివారు వ్రాసినచరిత్రములవలనఁ గూడ వ్యభిచారిణి యని కన్పట్టనందునఁ బతివ్రత యనుట కేమి సందియము? "అప్రతిషిద్ధ మనుమతం భవతి" అని కదా పూర్వులు చెప్పుదురు. "శాపాదపి శరాదపి" అని యీపె యుద్ధమునందుఁగూడ స్వతంత్రురాలు. ఈచరిత్రముంబట్టి స్త్రీలకు స్వాతంత్ర్యము ముఖ్యముగా వెల్లడి యగుచున్నది. ఈపెకు యుద్ధములలో మారీచసుబాహులు సహాయులు. వీరును యజ్ఞాదులయం దిష్టములేనివారే. సంఘసంస్కర్తలక్రింద మనము విధిగా బహూకరింపవచ్చును. ఐన నేమి? దైవ మిట్టియోగ్యుల కందఱికిని నచిరకాలముననే మృతి గల్పించెను. "శ్లో. పాపీ

చిరాయు స్సుకృతీ గతాయుః" అనుట యెవ రెఱుఁగరు? మారీచసుబాహులమాట కేమిగాని యీమె కొంతకాలము జీవించియున్నచోఁ ద్రిలోకములలోనను ముఖ్యముగా స్త్రీస్వాతంత్ర్యమును స్థాపించఁదగినయిల్లాలు. ఈమెనుగుఱించి యెంత చెప్పినను జెప్పవలసినదే ఇఁకను:—

## శూ ర్ప ణ ఖ.

ఈమె అంతబలవతి కాకపోయినను సంఘసంస్కరణపరాయణురాలు కాకపోలేదు. ఈమె బాలవితంతువులకే కాకయిచ్చయున్నచోఁ బుత్త్రవతులకుఁగూడఁబునర్వివాహమునంగీకరించిన పతివ్రతాశిరోమణి. లేకున్నచో శ్రీరాముని వరింపవలసినయవసర మీమె కేమియుండును? ఆయన భార్యాయుక్తుఁడై యుండఁగాఁ దన్ను వివాహమాడు మనుట తప్పిద మని కొందఱు వాదింతు రేమో? అప్పటిరాజులు బహుభార్యలు గలవా రగుటచే నట్లు చేసియుండును. సీతను భక్షించెద నని యీమె యన్నట్లు చెప్పుదురు కాని యది యిటీవల వాల్మీకికుకల్పనమే కాని వేఱొండు కాదు. పరోపకారపారీణుల కెంతటి కష్టములేని వచ్చుననుట కీమె నాసికాదివిచ్ఛేదనమే మనకు వేనోళ్ళ బోధించుచున్నది. ఈమెయన్నగారు మొదలైనవా రందఱును నట్టి యోగ్యులే. అయిన నేమి? పూర్వు లాయాచరిత్రము లను దమయిష్టము వచ్చినట్లు వ్రాసి యెక్కుడుగుణ మున్న

నది బొత్తిగాఁ గప్పిపుచ్చి తక్కువదోషమేనియు నయ్యది విస్తరించి ప్రపంచమును మోసముచేసియున్నారు. "శ్లో. పరగుణ పరమాణూన్ పర్వతీకృత్య" అనువిధమున వర్తించుసజ్జను లెప్పుడును నరుదుగదా! ఆయీచరిత్రము లన్నియుఁదిరిగియుఁ వ్రాయఁదగునిష్పక్షపాతులగుకవు లున్నచోఁ గొంతమైన నుపకారము జగమునకుఁ గలుగును. కాని, అట్టివారు కనుపడరు. లంకిణీ మొదలైనవారిఁగూడ నీపెతోపాటు గ్రహింపుఁడు. ఇంత యెందులకు? త్రిజట యోగ్యురా లని మనవారుకూడఁ గొంత సూచించియేయున్నారు. అసత్యము వ్రాయ బూనినను, అంత రాత్మ యెక్కడనో దానికి భంగము కలిగించుచునేయుండును. ఇఁకను:—

## తార

ఈమె మొదట వాలికి భార్యయై యతనితోఁ జిరకాల మనేకభోగభాగ్యములం దులఁదూఁగి పదపడి యతఁడు శ్రీరామునిచే నన్యాయముగఁ జంపఁబడఁగా నాతనికై శోకించి సహగమనమం దిచ్ఛగలదయ్యును లోకోపకారమునకై యాయుద్యమమునకు సాహసింపక సర్వసౌఖ్యములు తీరిన దయ్యు మార్గప్రదర్శకురా లగుటకు సుగ్రీవుని బెండ్లియాడి స్త్రీపునర్వివాహతంత్రమును నిల్పినపరమోత్తమురాలు. అందుల కంగీకరించిన యంగదునిగూడ మనము శ్లాఘింపవలసియేయున్నది. "ఇతఁ

డాపెగన్న పుత్రుఁడు కాకుండుటచేఁ గలుగఁజేసికొనలే" దనికొంద
ఱును; "ఇది దేవరన్యాయ" మని కొందఱును వాదింపవత్తు
రేమో? మొదటిశంకకుఁ గనకున్నను నంతికన్న నెక్కుడుగాఁ
బెంచుటచే నతఁ డాఁపబూనినచో నంతతప్పిదను లేదని చెప్పు
చున్నాను. ఇఁక రెండవపూర్వపక్షమును దేవరన్యాయమనఁగాఁ
బునర్వివాహమునకే పర్యాయపద మని సిద్ధాంతీకరించుటకు
సంశయ మేమి? కళత్రవంతుఁడగు సుగ్రీవునిం బెండ్లియాడుట
కొంత విరుద్ధమే యైనను నయ్యది సుగ్రీవుని లోపమని . కాని
యింతకుమున్ను చెప్పిన బహుభార్యాకత్వము నాఁటికాలమున
కుచితమే యని కాని సమాధానము చెప్పవచ్చును. ఈపెచరిత్ర
నాగరికత నేర్చికొనఁదగు స్త్రీరత్నములకు వేద మని చెప్పనొ
ప్పును. మనతార వ్యభిచారిణి గనుక నామె నిందుఁ జేర్చికొనఁ
గూడదు. ఈపుంశ్చలివలన నాపెకు తార యని పిలిపించుకొనుట
గూడఁ గొంత హేయ మని శోఁచియుండునేమో ? పాపము !
ఈ యనుమాన మీ కులటంబట్టి యా పతివ్రతాతిలకమునకుఁ
గూడ రావలసివచ్చెనుగదా! "తాఁ జెడ్డకోఁతి వన మెల్లఁ
గాల్చుట" యిట్టిదియే కావచ్చును. ఐన నాపె కేమిలోపము?
ఒక్కవరాంగశబ్దమును, ఒకచో శివాశబ్దమును నెంతతారతమ్య
ముగలవస్తువులన్ బోధించుచున్నవో మన మెఱుఁగమా ?
అంతలోనన బుద్ధిమంతులు తారతమ్యము గుఱుతింపకుందు రే ?
ఈతారచరిత్రమునకును, "శ్లో. అన్యే మృతస్య క్రీడంతి దారై

రపి ధనైరపి” అనునార్యోక్తికిని సంబంధింపఁజేసి మృతులభార్యల కెల్ల బునర్వివాహ ముచితమే యని మనము సాధించిన నేమితప్పగును? ఈశ్లోక మిందులకు విధి గాదని కాని ధర్మశాస్త్రము కాదని కాని కొందఱు వాదింపవత్తురేమో? ధర్మశాస్త్రములును నిట్టివారిమాటలే కనుక వారంత శ్రమపడి వాదింపనవసరముండదు. ఇంకను:—

## మండోదరి

ఈమె వాలివలన నంగదునిఁ గని యతనివానరచేష్టలు నచ్చక కాఁబోలును! పులస్త్యకులశిరోమణియగు రావణుని గట్టికొన్నట్లు శో౯చుచున్నది. ఇయ్యెడల మనవారు మనగ్రంథములలో మఱియొకవిధముగా వ్రాసియున్నను మన మవి పాటింపఁదగినవి కావు. “వాలిమాత్ర మింద్రపుత్రుఁడు గాఁడా?” అని యందురేమో? మొదట నది విశ్వసింపఁదగినదే కాదు. వాదసౌకర్యార్థము క్షణకాల మొప్పుకొన్నను తండ్రి యింద్రుఁడగుట కొమరుని కేమియోగ్యత నాపాదించును? ఎవరియదృష్టము వారిదే కనుక నది యంత పీఠైనయుక్తిగాఁ గనుపట్టదు. దీనిం బట్టి చూచినను స్త్రీలకు వివాహవిషయమున స్వాతంత్ర్యము నిర్వివాద మనియు నంతమాత్రమున వారికిఁ బాతివ్రత్యము పోవనేర దనియుఁ దేలుచున్నది. ఈమె మహాపతివ్రత యని నేను వేఱే చెప్పనక్కఱలేదు కదా! ఇందులోనూ

త్రము కొంచెము జాతిమతాదివైషమ్యము పొడకట్టుచున్నది. అది మనము స్వీకరింపఁగూడదు. ఇఁకను:—

# అహల్య

ఈమె నప్పటికిని నిప్పటికినిగూడ నింద్యురా లనియే మనము భావింపవలయును. శ్రీరామునిపాదరజ మీమెను పవిత్రఁగా జేసినదను కథ బొత్తిగా మనకు విశ్వాస్యము కాదు. అంతకుఁ బూర్వ మీమె శిలయై శాపవశమున నున్న దనుట యంతకుముందే నమ్మఁగూడదు. ఈమె దుశ్శీలముకతముననే కాఁబోలును! గౌతముఁడు రచించిన తర్కశాస్త్ర మంతవిరుద్ధముగా నున్నయది. ఆ శాస్త్రము నీముని యీ విరహాదినములలో వ్రాసియుండవచ్చునని తెలుచున్నది. పాపము! "శ్లో॥ స్వస్థే చిత్తే బుద్ధయ స్సంభవంతి" అని కదా! చెప్పుదురు. దేనికైనను బుద్ధి స్వాస్థ్యము ముఖ్య మనక తప్పదు. ఏది యెట్లైనను నీమెను బూర్వులు పతివ్రతనుగా నొప్పుకొన్నను మన మొప్పఁగూడదు. సంఘసంస్కరణలక్షణ మిక్కిమినియందు బొత్తిగాఁ గన్పట్టదు. ఈమెంబట్టి స్త్రీలు నేర్చుకొఁదగినసంగతులు లేవు. ఆయాచరిత్రములకుఁ దగిన కవులు కొందఱుండుట మనకు ముఖ్యావసరమే కాన నట్టివారిం గొందఱిని చూపించి యింతతో విరమించుచున్నాఁడను.

కురుకుళ్ల-కుళ్లారాయకవి :— ఇతఁడు కర్ణాటకదేశస్థుఁడే యైనను చదువుకొన్నది బంగాళము గనుక నఱవములోఁ గవి

త్వము చెప్పమొదలిడి ఓఢ్రభాషలో ననేకప్రబంధములు రచియించి యరబ్బులను సంతోషపెట్టిన మహాకవి. ఇతనికి సంస్కృతములోఁ బ్రవేశము లేదన వలనుపడకున్నను; ఆంధ్రము రాదని బొత్తిగాఁ జెప్పనవకాశము లేదు. ఇతఁడు నానాభాషలు వచ్చినవాఁడును, సరసముగా రచింప నేర్పుగలవాఁడును నని యీ యుదాహరించెడి పద్యమే వేనోళ్ళ ఘోషింపవచ్చును.—

"శ్లో॥ యూచుంతత్రిసిడేన్ తథాపి నెటినెల్ తస్మాన్మమాయాశశీ
నోగోసార్ మదరాసుకాయకరితం హింగేందుబాయోందుసం
నింగత్పూరయ నింగకూదవిడుదక్ నీవాఁడసంటెన్ గదా!
కిస్యాస్తే మయి బొల్లహుంలజిసునో తక్సీర్ నమే రేఉపర్"

దీనివలనఁ బ్రధానముగా సులభశైలి యాలవఱుపఁదగిన యితరభాషలయందుఁగూడ నిమ్మహాకవికిఁ బ్రవేశ మున్నదని తేలుచున్నదికదా? విసంధి మొదలగు శబ్దదోషములును, అనన్వయము మొదలగు నర్థదోషములును నీపద్యమునఁ గనుపట్టినను మనకు రసము ప్రధానము గనుక నవి యంతగాఁ బాటింపక యతిభంగములు వెదుకక శృంగారరసమే కాక తక్కిన రసములుగూడ లేకుండ నిట్లు రచించుటయే కష్టమని మనము సంతసింపవలసియున్నది. ఇయ్యనఘుని కవిత్వములో స్వకపోలకల్పిత మించుకయు లేకున్నను; పూర్వకవుల త్రోవలు లేవని నిర్ణయింపలేము. ఇతఁడువ్రాసిన ప్రబంధము లనేకము లున్నను నందు "మార్జాలికాపరిణయము" ముఖ్యమైనది. ప్రతిపద్య

రసాత్మకమ్ముగు కతన నందలి పద్య మేది యుదాహరింపకుండుట
కును నోరాడక యూరకుంటిని.

ఇక ముదుగుళ్ళ-ముచ్చట్లరాయకవి :— ఈతఁడాంధ్ర
యాంధ్రము మాత్రమే స్వదేశభాష యగుటచేఁ జక్కఁగా సంపా
దించి యుత్తరభాషా ప్రవిష్టులగువారు వసించుపట్టణముల వసించు
చుండుటచేఁ గొంత కాకున్న మఱికొంతయైనను తేలికగా కవిత్వము
చెప్పనేర్చిన కవిశిఖామణి. ఇతఁడు తక్కిన భాష లెవ్వియును
రాకపోయినను వానిలోనికిఁ బోక సంస్కృత మాత్రమునుఁ గో
జేరియుండుటను బట్టి తత్సాహిత్యమ్మునను బిదె నేర్చెను మఱి
కొందఱు పండితుల పరిచితి వలనను నాభాషలోఁగూడ నప్రతిహత
నిరంకుశ నిస్సంశయ నిరుపమాన పాండిత్యమును సంపాదించి
యందలి గ్రంథముల నతిశీఘ్రమున దెలుఁగులోనికిఁ దెచ్చిన
కవితాధురంధరుఁడు. ఈ యసమానకవితాకన్య గ్రంథములును
వానిపై నితరుల యభిప్రాయములును గల పుస్తకములు గొన్ని
నేనిచ్చటికే తెచ్చియున్నాఁడను గాన నయ్యవి చూచి విద్వాంసులు
గుణగ్రహణ మొనరింతురని యితనివిషయ మింతతో వదలి
మఱియొక కవితల్లజుని చరిత్రము మొదలిడుచున్నాను.

తరుసూరు-భ్రమరేశ్వరకవి:— ఈయన కెందుఁ పాండిత్య
మున్నదో యెవ్వరును నెఱుఁగనేరరు గాని కవిత్వము మాత్రము
కడు జిగిబిగిగా నుండును. అందొక పద్య ముదాహరించు
చున్నాను. ఈయన కితరభాష బొత్తిగా రాదనియే కాక యా

భాషలయందు రుచిగూడ నంతగా లేదని వాడుక. ఈ పద్యమే సర్వమును మీకుఁ జెల్లడింపఁగలదు.

"క. గుంఘాన్లు భూంఘ లై యా
వంఘీముంఘీలఘిమ్ని నహ్వారె మీకున్
జెంఘాల్ మునుంఘులకు హా!
నెంఘాల్ గుంఘాల్ సమేఘు వి.విల భళిరే!

ఇందులో యతిప్రాసము లుండుటంబట్టి తెలుఁ గనక తీసిన కదా! తక్కినవి బీజాక్షరము లని తోఁచుచున్నవి. అవి యిప్పటివారికంత రుచి గలిగింపకపోవుటయే గాక నమ్మకమూఁ బుట్టింపనేరవు. ఈయన యీ కాలపువాఁడే యైనను బూర్వకాలమునకుఁ బనికివచ్చు నని కొంద అందురు కాని కొందఱేమియున్ జెప్పలేక యూహించుచున్నారు. ఇంకను ననేకులు మహాకవులు కలరు. వారిన్గురించి యింకొకసారి ముచ్చటింపఁ దలచి యిప్పటికి విరమించుచున్నాను. నే నీనాఁ డుపన్యసించిన సంగతులలో మీ కెవ్వరికేని విరుద్ధము లున్నట్లు తోఁచినచో నిస్సంశయముగా వెలపుచ్చవచ్చును. భగవంతుఁడు మనకుఁ ద్వరలో నాయీయీమార్పులకుఁ దోడ్పడి కార్యసిద్ధి యొనర్చుఁగాత !!!

(అని విరమించును.)

సంశ :—— దేవరవా రీనాఁ డుపన్యసించిన సంగతులు విరుద్ధములే కాకపోవచ్చును. కాని చాలభాగములు మాకు

మాత్రము విరుద్ధములుగాఁ గన్పట్టుచున్నవి. తఱచుగా మీ యుపన్యాసములు వినఁగా వినఁగా మనసునకుఁ బట్టి పూర్వా చారాదరము బొత్తిగాఁ బోయి యిందు విశేషాదరము కలుగక పోదు. ఇంతకును మీరు మమ్ము బాగుచేయ నెంచి యింతపఱకు శ్రమపుచ్చుకొనుచున్నారని మాత్రము గుఱుతెఱింగినవా రిందులో ననేకు లుండకతీరదు. ఒకవేదమును బట్టియే యనేకు లనేక మతములు సాధించినట్లు తమరును గొన్నిసంగతులు సాధించియున్నారు. అవి మిక్కిలి నూతనములు. ఆచారము లోనికి వచ్చినపిమ్మటఁ బ్రాచీనములే కాఁగలవు. ఇంతపరిశ్రమ మిచ్చినందులకు క్షమింతురుగాక !!!

(అని యందఱును నిష్క్రమింతురు.)

త్రిలోకీవిజయము

సంపూర్ణము.



రాజమహేంద్రి "అవంతి ప్రెస్" నందు ముద్రింపబడినది.